SIMULTANEOUSLY PUBLISHED FROM VIJAYAWADA AND MADRAS



# ఆంధ్రపత్రిక



Regd. No H. 506 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO సంపుటం 52, సంచిక 210

విజయవాడ, గురువారం 4-11-1965 THE ANDHRA PATRIKA MORNING 6 పుటలు : 8 పైసలు

# యుద్ధవిరమణ తర్వాత ఆక్రమించిన ప్రాంతాల నుంచి పాక్ గెంటివేత

## అవసరమైన చర్యలన్నీ తీసుకొనగలమని ప్రధాని శాస్త్రి ప్రకటన

### పాకిస్తాన్ దాడులను తిప్పికొట్టడంలో భారత్ వైఖరికి తిరుగులేదని వివరణ

న్యూఢిల్లీ, నవంబరు 3 :

సెప్టెంబరు 23 న యుద్ధ విరమణ జరిగిన అనంతరం భారతి భూభాగంలో పాకిస్తాన్ ఆక్రమించుకొన్న ప్రాంతాల నుంచి, పాక్ సేనలను గెంటివేయడానికి అవసరమైన అన్ని చర్యలను తీసుకొనగలమని ప్రధాని లాల్ బహదూర్ శాస్త్రి నేటి రాత్రి ఇక్కడ ప్రకటించారు.

ఢిల్లీ నగరంలోని రైల్ కుసుమ నమి పంలో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగ సభలో శ్రీ శాస్త్రి ప్రసంగిస్తూ భారత్—పాక్ పోరాటంపై భద్రతా మండలి తీసుకొనే నిర్ణయంపై తాను ఇప్పుడేమీ చెప్ప నని అంటే పాకిస్తాన్ చేత యుద్ధ విరమణను ఖచ్చితంగా పాటింప జేయడం మండలి కర్తవ్యమని సమితి ప్రధాన కార్య దర్శి బాధ్యత అని మాత్రం తాను స్పష్టం చేయగలనన్నారు.

భద్రతామండలి ఎలాంటి నిర్ణయం చేసినప్పటికీ కాశ్మీర్ తో లేదా రాజస్థాన్ తో లేదా ఏ ఇతర ప్రాంతంలోనైనా భారత భూభాగాన్ని, (పాకిస్తాన్) ఆక్రమించుకొనడానికి తాము అంగీకరించబోమని ఆయన ఖచ్చితంగా చెప్పారు.

యుద్ధ విరమణ తర్వాత భారత్ భూభాగాలలోనికి చొచ్చుకు రావడానికి లేదా ఆక్రమ ప్రవేశాలకు పాకిస్తాన్ ప్రయ త్నించడం "భారత్ పై ఆక్రమణ" కాగల దని అది కేవలం తప్పు మాత్రమే కాక కవ్వించకుండా కొనసాగించిన చర్య కాగలదని కూడా ప్రధాని అన్నారు.

భారత్ అగ్ర స్థావరాలపై పాకిస్తాన్ నిరంతరం కొనసాగిస్తున్న దాడులను గురించి ప్రధాని ప్రస్తావిస్తూ, కావాలని చేస్తున్న ఈ దాడులను భారత్ తప్పనిసరిగా తిప్పి కొట్టవలసి వస్తున్నదన్నారు. చివరకు ఏమి జరిగినా లెక్క చేయకుండా ఈ విషయంలో ఇక ముందు కూడా ఈ వైఖరినే భారత్ అనుసరించి తీరగలదన్నారు.

యుద్ధవిరమణ దశలో ఇలాంటివి జరిగ కుండా చూచి తనకుగల గురుతర బాధ్యతను నిర్వహించవలసిన ధర్మం భద్రతా సంఘం మీదను, సమితి కార్యదర్శి మీదను, సమితి పరిశీలకుల మీదను కలదని కూడా ప్రధాని అన్నారు.

### ఇసుక పెళ్ళ పడి ఆర్గురు పిల్లల దుర్మరణం

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాదు, నవంబర్ 3 : మహ బూబ్ నగర్ జిల్లా మక్తల్ తాలూకా వార్వా గ్రామంలో గత గురువారం నాడు ఇసుక దిబ్బ కూలిపోయి మీద పడిన ఫలితంగా 8—14 సంవత్సరాల మధ్య వయస్సు గల ఆరుగురు బాలురు బాలికలు తీవ్రంగా గాయపడి, ప్రాణాలను కోల్పోయారు.

పోలీసు ప్రధాన కార్యాలయానికి ఆల స్యంగా అందిన వార్తవల్ల ఈ విషయం ఇక్కడకు తెలియవచ్చింది.

11 మంది బాల బాలికలు వార్వా గ్రామం శివార్లలో ఉన్న ఇసుకను తీసుకొని రావడానికి వెళ్ళగా ప్రమాద వశాత్తు ఇసుక పెళ్ళ విరిగి వారి మీద పడింది.

## బంగారపు బాండ్లలో పెట్టుబడులు: మినహాయింపులు కలుగచేస్తూ బిల్లు

న్యూఢిల్లీ, నవంబర్ 3—రక్షణ ఋణాలలో 15 ఏళ్ళ బంగారపు బాండ్లలో పెట్టుబడి పెట్టేవారికి కొన్ని మినహాయింపులు కలుగ జేసే బిల్లును ఆర్థికమంత్రి శ్రీ కృష్ణమాచారి నేడు లోక్ సభలో ప్రవేశపెట్టారు.

అక్టోబర్ 19 వ తేదీన రాష్ట్రపతి జారీ చేసిన ఆర్డినెన్స్ స్థానే ఈ బిల్లును ప్రవేశ పెట్టారు.

బంగారపు బాండ్లలో పెట్టుబడి పెట్టే వారికి ముఖ్యంగా ఈ క్రింది సౌకర్యాలు కలుగ జేశారు.

వీటిపై వచ్చే ఆదాయానికి రాబడి పన్ను విధించరు. సాలీనా ఐదు కిలో గ్రాముల బంగారంవరకు సంపద పన్ను, బహుమతి పన్ను ఉండదు, ఏభై కిలో గ్రాములవరకు మొదటి దఫా ఎస్టేట్ సుంకం ఉండదు.

### ముఖ్యమంత్రి దంపతుల ఆదర్శం

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

హైదరాబాదు నవంబర్ 3 : జాతీయ రక్షణ ఋణాలకు ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మా నందరెడ్డి 1000 రూపాయలు, జాతీయ బంగారం బాండ్లకు ముఖ్యమంత్రి సతీ మణి శ్రీమతి రాఘవమ్మ 196 గ్రాముల బంగారం నేడు హైదరాబాద్ స్టేటు బ్యాంకులో పలువురి సమక్షంలో సమర్పిం చారు.

జాతీయ రక్షణ ఋణానికి $4\frac{1}{4}$ శాతం వడ్డీ బంగారం బాండ్లకు $6\frac{1}{2}$ శాతం వడ్డీ ఇవ్వబడుతుంది.

శ్రీమతి రాఘవమ్మ సమర్పించిన బంగా రపు వస్తువులలో గాజులు, గొలుసులు, చెవి కమ్మలూ ఉన్నాయి.

స్టేటు బ్యాంకుకు సతీ సమేతంగా ముఖ్యమంత్రి వచ్చినప్పుడు వారికి జనరల్ మేనేజర్ శ్రీ పి. సీతాపతిరావు స్వాగతం చెప్పారు.

### భద్రతా మండలి సమావేశం తిరిగి వాయిదా

న్యూయార్క్, నవంబర్ 3: భారత్, పాక్ పోరాటానికి సంబంధించిన తీర్మానాన్ని రూపొం దించడంలో భద్రతామండలి సభ్యుల మధ్య రహస్య ఒప్పందం కుదరనందువల్ల మండలి సమావేశం నేడుగూడా వాయిదా పడింది. మండలి తిరిగి ఎప్పుడు సమావేశమయ్యేది నిర్ణయించలేదు.

---

హైదరాబాద్, నవంబర్ 3 : అహమ్మదా బాద్ లోని నేషనల్ ఫిజికల్ లేబరేటరీ డైరెక్టరు డా. కె.ఆర్. రామనాథన్ నవం బర్ ఎనిమిది, పది తేదీలలో ఇక్కడ సిరీస్ ముఖరం రూ ఉపన్యాసాలు ఇస్తారు.

గత సంవత్సరం ఈ ఉపన్యాస కార్య క్రమాన్ని బయో ఫిజికల్ సంఘం ఏర్పా టుచేసింది.

### అధికాహారోత్పత్తికి రాష్ట్రంలో కృషి

ముఖ్యమంత్రి వివరణ

హైదరాబాదు, నవంబరు 3 . రాష్ట్రంలో ఆహారధాన్యాల అధికోత్పత్తికి ప్రభుత్వం అనేకచర్యలు తీసుకుంటున్నదని ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి తెలియజేశారు.

'ఆంధ్రప్రదేశ్' నవంబరు సంచికలో ఆహారరంగంపై ముఖ్యమంత్రి వ్రాసిన వ్యాసంలో యీ విషయం పేర్కొన్నారు.

ఆహారధాన్యాల వినియోగాన్ని తగ్గించి, వాటికిమారుగా ఉపయోగించడానికి కూర గాయలను, పండ్లను అధికంగా పండించేం దుకు నీటివనరులను ఉపయోగించగల మన్నారు. రాష్ట్రంలో అసంఖ్యాకమైన చెరువులతోపాటు అరుపండలమైళ్ళ తీర ప్రాంతం ఉన్నదనీ, మాంసాహారులకు ఆహార ధాన్యాలకు బదులు చేపలు ప్రత్యామ్నాయ ఆహారమనీ, అందువల్ల మత్స్యపరిశ్రమను అభివృద్ధి చేయాలనీ అన్నారు.

మనది మిగులు రాష్ట్రమైనా ఇతర రాష్ట్రాలతోపాటు మన ప్రధాన పట్టణా లలో రేషనింగ్ ను అమలుచేయడానికి అంగీక రించామనీ, దీనిని ప్రజలు ఆమోదిస్తారనే భావిస్తున్నామనీ పేర్కొన్నారు.

వారానికొకపూట ఉపవాసం చేయాలన్న ఉద్యమాన్ని సఫలం చేయాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

అధికాహారోత్పత్తికి అవసరమైన సదు పాయాలన్నిటినీ ప్రభుత్వం కలుగజేయ వలసిఉన్న దన్నారు. అధికోత్పత్తి కృషిద్వారా రాష్ట్రంనుంచి ధాన్యాలను మరింత ఎక్కు వగా ఇతర రాష్ట్రాలకు సరఫరా చేయవచ్చు నన్నారు.

యుద్ధరంగంలో జవానుల మాదిరిగా, ఆహారరంగంలో రైతులు కృషిచేయాలన్నారు.




### హరిజనులకు ఇండ్ల స్థలాలు

ఈ ఏడాది బడ్జెట్ లో రు 20 లక్షలు కేటాయింపు

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, నవంబర్ 3 : హరి జనులకు ఇండ్ల స్థలాలు ఇవ్వడానికి 20 లక్షల రూపాయలను ఈ ఏడాది బడ్జెట్ లో కేటాయించడం జరిగిందని, మరో 30 లక్షల రూపాయలు ఈ ఏడాదికి కనీసం అవసరము ఉంటుందని సాంఘిక, సంక్షేమ శాఖామంత్రిణి శ్రీమతి టి.ఎన్. సదాలక్ష్మి ఈ వేళ పత్రికా ప్రతినిధు లతో మాట్లాడుతూ తెల్పారు.

హరిజన సమితి గృహాలలో ఉండేటటు వంటి విద్యార్థులకు నెలసరి ఉపకార వేతనం 15 రూపాయలనుంచి రు20ల వరకు, విద్యా ర్థినులకు 21 రూపాయలవరకు హెచ్చించ బడినదని ఆమె చెప్పారు.

హరిజనులు చాలామంది సైనికులుగా చేరారు కనుక వారి సంక్షేమానికు కేటాయించే మొత్తాలు ఎంతమాత్రం తగ్గదని ఆమె అన్నారు.

## ధాన్య సేకరణ, రేషనింగ్ సమస్యలు: ప్రతిపక్షాలతో చర్చ

### శనివారంనాడు ఢిల్లీలో సమావేశం

న్యూఢిల్లీ, నవంబరు 3 :

లక్షకు మించి జనాభాగల పట్టణాలలో రేషనింగ్ ప్రవేశ పెట్టడం, ధాన్య సేకరణ కార్యక్రమం తీవ్రం చేయడం మున్నగు అంశాలపై శనివారంనాడు పార్లమెంటులోని అన్ని పార్టీలు, వర్గాల నాయకులతో చర్చలు జరుపుతారు.

దేశంలో కొనుగోలుశక్తి అధికంగాగల ప్రాంతాలలో ఆహారధాన్యాలు దాచివేయబడ కుండా చూడడం రేషనింగ్ లక్ష్యం. ధాన్య సేకరణ విషయంలో ఉత్పత్తిదారులపై లెవీపద్ధతి అమలును రాష్ట్రాలకు సూచిం చడం జరిగింది. గరిష్ఠస్థాయిని ధాన్య సేకరణకు మిగులు రాష్ట్రాలు అన్నివిధాలా కృషిచేయాలని, లోటురాష్ట్రాలు కూడా తమ ప్రాంతాలలో మిగులు ఉన్నవారివద్ద నుంచి ధాన్యం సేకరించాలని సూచించడం జరిగింది.

గ్రేడ్ లవారీ లెవీపద్ధతి ప్రవేశపెట్టం డుకై వివిధ గ్రామాలలో ఉత్పత్తిదారుల జాబితాను సిద్ధం చేయడానికై పరిపాలనా యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలని రాష్ట్రా లను కోరడం జరిగింది.

పొదుపుచర్యల విషయంలో కేంద్రం రెండుసమూనాఉత్తర్వులు చేసింది. ఒకటి వివా హాదిశుభకార్యాలలో చేసే విందులలో అతిథుల సంఖ్య తగ్గించడం, రెండవది భోజనంలో వంటకాలపై పరిమితి విధించడం.

ఆహారధాన్యాల వినియోగంలో పొదుపు చేయవలసిందిగా ప్రజలను కోరుతూ, కేంద్రం రాష్ట్రాలు పెద్దఎత్తున ప్రచారం చేయాలని కూడా తలపెట్టబడింది.

అత్యవసర ఆహారప్రణాళికను గురించిచర్చిం చేందుకై పార్లమెంటులోని అన్ని పార్టీలు, వర్గాల నాయకుల సమావేశం శనివారంనాడు జరుగుతుంది.

కేంద్ర ఆహార మంత్రి శ్రీ సుబ్రహ్మణ్యం ఏర్పాటు చేసిన ఈ సమావేశానికి పార్లమెంటు ఆహ్వానాలు పంపబడినవి.

లక్షకు పైగా జనాభా కల నగరాలలో రేష నింగ్ ప్రవేశ పెట్టాలని, ప్రొక్యూర్ మెంట్ కార్యక్రమం చేయాలని, పొదుపు చర్యలు తీసు కోవాలని, ఆహారోత్పత్తి పెంపుదలకై వెంటనే స్వల్పకాలిక చర్యలు తీసుకోవాలని అత్యవసర ఆహార ప్రణాళిక సూచిస్తున్నది.

ఉభయ సభలకు చెందిన వివిధ పార్టీల నాయకులు, ఇండిపెండెంట్ సభ్యులకు ఆహ్వా నాలు పంపారు.

శ్రీయుతులు ఎన్. జి. రంగా, హెచ్. ఎన్. ముఖర్జీ, ఎస్. ఎన్. ద్వివేది, ఎ. బి. వాజపేయ్, సి. ఎన్. అన్నాదురై, మహమ్మద్ ఇస్మాయిల్, సుచేత కృపలాని, ప్రకాశ్ వీర్ శాస్త్రి, ఆచార్య కృపలాని, బి. గోపాలరెడ్డి ప్రభృతులకు ఈ ఆహ్వానాలు పంపబడినవి.

## ప్రణాళికలు, విధానాలు పునః పరిశీలన

### వివిధ శాఖలకు ప్రధాని ఆదేశం: లోక్ సభలో మంత్రి శ్రీ హాథీ వెల్లడి

న్యూఢిల్లీ, నవంబర్ 3 : ఇటీవల పొందిన అనుభవం దృష్ట్యాను, భావి అవసరాల దృష్ట్యాను అన్ని మంత్రిత్వ శాఖలు, విభా గాలు, తమ తమ విధానాలను, ప్రణాళికలను గురించి తిరిగి త్వరితగతిని పరిశీలించవలెనని ప్రధానమంత్రి ఇటీవల ఆదేశించారు.

దేశీయాంగ శాఖలో మంత్రి శ్రీ జె.ఎల్. హాథీ నేడు లోక్ సభలో ఈ విషయాన్ని వెల్లడించారు.

పాకిస్తాన్ దురాక్రమణ సందర్భంగా ప్రభుత్వము తన పరిపాలనా యంత్రాంగాన్ని ఏ విధంగా పునర్వ్యవస్థీకరించినదీ తెలియ జేసే ఒక ప్రకటనను శ్రీ హాథీ సభవారి ముందుంచారు.

అత్యవసరంగా నిర్ణయం తీసుకోవలసి ఉన్న అంశాన్ని గురించి పరిశీలన జరిపి త్వరితగతిని ఒక నిర్ణయం తీసుకొనబడే టట్లు చేయడానికి, వివిధ మంత్రిత్వ శాఖల మధ్య సమన్వయాన్ని సాధించ డానికి వీలుగా మంత్రివర్గ కార్యదర్శి అధ్యక్ష తన సీనియర్ కార్యదర్శులతో ఒక సంఘాన్ని నియమించినట్లు ఈ ప్రకటనలో పేర్కొ న్నారు.

త్వరితగతిని నిర్ణయాలను తీసుకొన డానికి, అత్యంత పరిస్థితి అవసరాలకు తగినట్లుగా అన్ని స్థాయిలలోను పరిపాలనను క్రమబద్ధం చేయడానికి, ప్రస్తుత పరిస్థితికి అనుగుణంగా పని జరిగేటట్లు చూడడానికి అన్ని మంత్రిత్వ శాఖలు, విభాగాలు తమ పరిపాలనా పద్ధతులను, విధా నాలను అభివృద్ధిపరచాలని సూచించడం జరిగింది.

రక్షణ అవసరాల విషయంలో వీలయి నంతవరకు స్వయం పోషకత్వానికి హెచ్చు ప్రాధాన్యాన్ని ఇవ్వడం జరిగిందని, ప్రక టనలో తెలిపారు.

దిగుమతులకు ప్రత్యామ్నాయ పద్ధ తులను కనుగొనే విషయంలో వివిధ చర్యలను అనుభుజరపడం ప్రారంభించినట్లు, ఇందు కోసం రక్షణ మంత్రిత్వశాఖలో ప్రత్యేక విభాగాన్ని ఏర్పాటుచేస్తున్నట్లు ప్రకటనలో వివరించారు. రక్షణావసరాలను తీర్చడానికి దేశంలో లభ్యమయ్యే ఉత్పత్తి స్తోమతను గరిష్ఠ స్థాయిలో వినియోగించడంలో జరిగే కృషిని ఈ కొత్త విభాగం సమన్వయపరు స్తుంది.

ప్రణాళికలో రక్షణావసరాలకు ప్రాధా న్యం ఇచ్చే నిమిత్తం దానిని పునఃసమీక్షిం చడం జరుగుతున్నది. ప్రణాళికాశాఖమంత్రి నవంబర్ నాల్గవ తేదీన ఈ విషయమై లోక్ సభలో సమగ్రమైన ప్రకటనను చేస్తారు. అధికాహారోత్పత్తి సాధనకు స్వల్ప కాలిక చర్యలను అమలు జరపడానికి ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇస్తున్నారు.

---

మద్రాసు, నవంబర్ 3 : నేడు ప్రారంభ మైన మద్రాసు శాసనసభ సమావేశాలకు కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కామరాజు హాజ రైనారు.



రాజస్థాన్ గ్రామీణులు రక్షణమంత్రి శ్రీ చవాన్ కు ఒంటెలను బహూకరించినప్పటి ఫోటో

## పట్నాయక్, మిత్రాలపై చట్టబద్ధంగా చర్య

### లోక్ సభలో తిరిగి ప్రతిపక్షాల విజ్ఞప్తి: ప్రధాని హామీ అమలు చేస్తామని నందా జవాబు

న్యూఢిల్లీ, నవంబరు 3 :

ఒరిస్సా మాజీ ముఖ్యమంత్రులు శ్రీ బి. పట్నాయక్, శ్రీ బీరేన్ మిత్రాగారలపై కేంద్ర నేర పరిశోధక సంస్థ సమర్పిం చిన నివేదిక దృష్ట్యా వారిపై చట్టరీత్యా చర్యలు తీసుకోవా లని లోక్ సభలో నేడు ప్రతిపక్షాలవారు తిరిగి కోరారు.

కొన్ని ప్రభుత్వ లావాదేవీలలో శ్రీ పట్నా యక్, శ్రీ మిత్రాగారుకున్నట్లు ఒరిస్సా శాసన సభకు సమర్పించబడిన ప్రత్యేక ఆడిట్ నివేదిక దృష్ట్యా కూడా వారిపై చర్య తీసుకోవాలని ప్రతిపక్షాలవారు కోరారు.

ఇవాళ ప్రశ్నోత్తరాల సమయంలో శ్రీ ఎస్. ఎన్. ద్వివేదీ చేసిన ఈ సూచనను శ్రీయుతులు హిరేన్ ముఖర్జీ, ఎన్. జి. రంగా, యు. ఎం. త్రివేదీ, హెచ్.. వి. కామత్ గార లతో సహా పెక్కు మంది సమర్థించారు.

ఆడిటర్ జనరల్ నివేదిక లభ్యమయిన తర్వాత చర్యలు తీసుకోగలమని గత మార్చి 16 వ తేదీన ప్రధాన మంత్రి శ్రీ లాల్ బహ దూర్ శాస్త్రి ఇచ్చిన హామీని సభ్యులు పునశ్చరణ చేశారు.

ప్రధాన మంత్రి హామీని అమలు జరుపగల మని దేశీయాంగ మంత్రి శ్రీ జి. ఎల్. నందా విస్పష్టంగా చెప్పారు. అయితే చర్య తీసుకునేముందు అవసరమైన విధానాలన్నీ పూర్తి కావలసిన అవసరం వుందన్నారు.

ఆడిటర్ జనరల్ నివేదికను ఒరిస్సా పబ్లిక్ ఎకౌంట్స్ సంఘం పరిశీలిస్తోందని, అది పూర్తి కావాలని శ్రీ నందా అన్నారు.

శ్రీ పట్నాయక్, శ్రీ మిత్రాగారలపై ఆరోపణలనుదర్యాప్తు చేసేందుకు ఒక విచారణ సంఘాన్ని ఏర్పాటు చేయాలని ప్రతి పక్ష సభ్యులు లోగడ సూచననుతిరిగి ప్రస్తావించారు.

పబ్లిక్ ఎకౌంట్స్ సంఘం ఆడిట్ నివేదిక పరిశీలించిన తర్వాత మాత్రమే ప్రతిపక్ష సభ్యుల సూచన పరిశీలించగలమని, ఇప్పుడేమీ చెప్పజాలమని దేశీయాంగ శాఖ సహాయ మంత్రి శ్రీ హాథీ తెల్పారు.

మంత్రివర్గ ఉపసంఘం పేర్కొన్నట్లుగా మాజీ ముఖ్యమంత్రుల లిరువురూ నేరస్థులని ప్రభుత్వం ఒప్పుకున్నట్లయితే వారు ఏ ప్రభుత్వ పదవిని చేపట్టకుండానే శాశ్వతంగా నిషే ధించడానికి సంకల్పించారా ? అని శ్రీ హెచ్. వి. కామత్ ప్రశ్నించారు.

రాజకీయచర్య లోగడే తీసుకోబడినదనీ, చట్ట రీత్యా చర్యలు తర్వాత తీసుకుంటామని శ్రీ హాథీ తెల్పారు.

### గ్రామోద్యోగుల భవితవ్యం

ప్రభుత్వం ఇంకా నిర్ణయం తీసుకోలేదని వెల్లడి

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, నవంబర్ 3:

రాష్ట్రంలోని గ్రామోద్యోగుల భవితవ్యంపై ప్రభుత్వం ఇంకా నిర్ణయం ఏదీ చేయలేదనీ, దీనిని శ్రద్ధగా పరిశీలించిన అనంతరం నిర్ణ యాన్ని తీసుకోగలమనీ రెవెన్యూ మంత్రి శ్రీ రామచంద్రారెడ్డి ప్రకటించారు.

ఇదివరలో ప్రభుత్వం ఏర్పాటు చేసిన రెండు సంఘాల సిఫార్సులలో కొన్నిటిని ప్రభుత్వం ఆమోదించి, అమలు చేసింది.

గత ఆదివారంనాడు తెలంగాణా గ్రామ వతన్ దార్ల సమావేశంలో మాట్లాడుతూ రెవెన్యూ మంత్రి పై విధంగా చెప్పారు. 'తెలం గాణావతన్ దార్' అనే ఈ సంఘ పత్రికను ఈ సమావేశంలో పార్లమెంట్ సభ్యుడు డాక్టర్ బూర్గుల రామకృష్ణారావు విడుదల చేశారు.

గ్రామోద్యోగుల వారసత్వం హక్కు పున రుద్ధరణపై రెండుఅభిప్రాయాలున్నాయంటూ పాతపద్ధతిని ఉంచాలని ఒకవర్గం కోరుతుండగా, దానిస్థానే మరో ఉత్తమ విధానాన్ని ప్రవేశ పెట్టాలని రెండవ వర్గం కోరుతోందని శ్రీ రామచంద్రారెడ్డి అన్నారు.

ప్రభుత్వం ఈ విషయంలో—ముఖ్యంగా తెలంగాణా వతన్ దార్ల విషయంలో—వారు ఈ విషయంపై హైకోర్టుకు వెళ్లినందున ప్రభు త్వం ఖరారు నిర్ణయాన్ని తీసికోలేదని ఆయన చెప్పారు.

### ప్రధాని శాస్త్రితో రాజాజీ సమావేశం

న్యూఢిల్లీ, నవంబర్ 3 : స్వతంత్ర పార్టీ నాయకుడు శ్రీ సి. రాజగోపాలాచారినేడు ప్రధానమంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రిని కలుసుకుని గంటకుపైగా సంభాషించారు.

—:o:—

### వార్ధాగంజ్ కు రాష్ట్రపతి రాక

వార్ధాగంజ్ ,నవంబర్ 3 : రాష్ట్రపతి రాధాకృష్ణన్ నేటి ఉదయం నాగపూర్ నుంచి కారులో ఇక్కడకు వచ్చారు. అసంఖ్యాకమైన జనసందోహం ఆయనకు అపూర్వ స్వాగత మిచ్చారు.

రాష్ట్ర గవర్నర్ డాక్టర్ పి.వి. చెరి యన్, ముఖ్యమంత్రి శ్రీ వి.పి. నాయక్ లు కూడా రాష్ట్రపతి వెంట వచ్చారు.

### ప్రెస్ కౌన్సిల్ బిల్లు: లోక్ సభ ఆమోదం

న్యూఢిల్లీ, నవంబర్ 3 : లోక్ సభ నేడు ప్రెస్ కౌన్సిల్ బిల్లును ఆమోదించింది. రాజ్య సభ ఇదివరకే ఈ బిల్లుకు ఆమోదం తెలిపింది.

## రైతుల స్థితిగతుల విచారణకు సంఘం

### — తిమ్మారెడ్డి సూచన

("ఆంధ్రపత్రిక" ప్రతినిధి)

హైదరాబాద్, నవంబర్ 3 : రైతు స్థితిగతులను విచారించటానికి వ్యవసాయ విచారణ సంఘాన్ని కేంద్రప్రభుత్వం వెంటనే నియమించాలని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి నేడు కోరారు.

రాష్ట్రంలో మెట్ట తాలూకాలలోను రాయ లసీమలోనుగల క్షామ పరిస్థితులు ముఖ్య మంత్రిని కలవరపెట్టినవనీ, వారు చిత్తూరు జిల్లాలోను, అర్థికమంత్రి కడప జిల్లాలోను పర్యటించి తగు చర్యలు తీసుకోదలచారనీ ఇవ్వాళ గాంధీ భవనంలో జరిగిన కాంగ్రెస్ కార్యకర్తల సమావేశంలో ప్రసంగిస్తూ శ్రీ తిమ్మారెడ్డి చెప్పారు.

ప్రధానమంత్రి ఇక్కడకు వచ్చినప్పుడ దాదాపు వందమందితో ఒక రాయబార వర్గం కలుసుకోనున్నదన్నారు.

గత రెండు రోజులలోను జరిగిన రైతు గోష్ఠిలో ముఖ్యమంత్రి రెడ్ టేప్ ను తగ్గించి అనేక వ్యవహారాలలో త్వరితంగా నిర్ణయం చేయటం చాలా ప్రశంసనీయ మని అలెగ్జాండర్ చక్రవర్తి చూపించిన ప్రతిభను పట్టుదలను ఆయన చూపిం చారనీ శ్రీ తిమ్మారెడ్డి అన్నారు.

శ్రీ తిమ్మారెడ్డి ఇంకా ఇలా చెప్పారు : "రైతులనుండి అభివృద్ధి పన్ను 50 లక్షల రూపాయలవరకు వసూలు చేస్తున్నది పరిశీలించి రైతుల కష్టాలను గమనించాలి చెప్పటం హర్షనీయం. జిల్లా రైతుల సమ స్యలను కూలంకషంగా చర్చించారు. గుం టూరు చానెల్ పథకం తరచూరయినా ఆల స్యం అవుతోంది. కృష్ణా గోదావరి పెద్ద కాల్వల మొగల్లో మేటవేసిన మట్టిని తొల గించటానికి బుల్ డోజర్లు లేకపోతే కూలీ లతో తీసివేయాలని నిర్ణయింటంవల్ల పంట హెచ్చు రావటానికి తోడ్పడుతోంది."

### న్యూయార్క్ ప్రత్తి మార్కెట్

న్యూయార్క్, నవంబర్ : 3

| | |
|---|---|
| ప్రారంభం ధర | 27.35 |
| ముగింపు ధర | . |

ప్రవేశం ... నెల్లూరు, ... కేంద్ర ప్రభుత్వంచే గుర్తింపబడిన కోర్సు. ప్రభుత్వ పరీక్షలకు పోటీచేయవచ్చును. త్వరపడి వెంటనే చేరండి. కోర్సు కాలవ్యవధి 8 నెలలు మాత్రమే. ... ఉద్యోగము లభిస్తుంది. S. S. L. C. పరీక్ష, మెట్రిక్యులేషన్ పరీక్ష లయినా ఫేలైనవారు చేరవచ్చును. కొద్ది సీట్లు గలవు. ప్రాస్పెక్టసుకు 0—50 పైసలు, అప్లికేషన్ ఫారముకు రు. 3 ఎం. ఒ. పంపవలెను. 29—10—65 తారీఖున తరగతులు ప్రారంభమైనవి. ఆలస్యంగా వచ్చు విద్యార్థులకు ప్రత్యేక బోధన.

**The Manager, 16/112, Trunk Road, Opposite Co-operative Town Bank, Nellore (A. P.)**

## సి. పి. డబ్ల్యు. డి. నాగపూర్

ఈ క్రింది నిర్మాణపు పనులకు, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు, నాగపూరు సెంట్రల్ డివిజన్, సి. పి. డబ్ల్యు. డి., నాగపూరు వారిచేత టెండర్లు మరల దాఖలుచేయ కోరబడు చున్నవి. (1) వరంగల్లునందు సెంట్రల్ వేర్‌హవుస్‌వద్ద 45 ఆర్. సి. సి. పెన్నగనల్ బిన్స్ నిర్మించుట. ఎస్టిమేటు ఖరీదు రు. 222136 (2) హైదరాబాద్‌నందు సర్వే ట్రెయినింగ్ డైరెక్టరేట్ అండ్ రీజనల్ సర్కిల్ వారికి ప్రొడక్షన్ అండ్ ట్రెయినింగ్ సెంటర్ నిర్మించుట. ఎస్. హెచ్. 60 యెకరముల భూమిని అభివృద్ధి చేయుట చదునుచేయుట, గట్టిపరచుట. ఎస్టిమేటు ఖరీదు రు. 461452—ఒక్కొక్క అంశము యొక్క టెండరు ఫారము పెట్టుకు రు15—చెల్లించి13—11—65వరకు పొందవచ్చును. టెండర్లు హైదరాబాద్‌లో అందుకొను ఆఖరు తేదీ 15—11—65 సా. 3 గంటలు. ఇతర వివరములకు5—6—65మరియు6—10—65 తేదీల ఇండియన్ ట్రేడ్ జర్నల్సుకు వరుసగా 1, 2 అనుబంధములకై చూడండి.

DA—11(793)/65

## పేరు మార్పు

... పటేల్ ..., రెడ్డివానిపల్లెలో నివాసముంటూ ఉపాధ్యాయునిగా పనిచేస్తూ 2 నెం. ... రు, మాస్టర్ దేవద్ వెంకటరమణ (S. O. ...) అను నా ప్రస్తుత పేరును "మాస్టర్ వెంకటరమణగా" మార్చుకొనదలచినాను ఇందుమూలముగా తెలియజేయుచున్నాను. సి. దేవద్ వెంకటరమణ.

## ట్రెయినింగ్

నెలకు 120 రు. నుండి 220రు. జీతములుగల టెలిఫోను ఆపరేటర్లుగను, టెలిగ్రాఫిస్టులుగను, సిగ్నలర్లుగను, అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్లుగను, P. U. C; H. S. C, S.S.L C. and Matric Passed or failed. Boys & Girls) కు శిక్షణ ఇవ్వబడును. 1రు.ఎం.ఒ. పంపిన ప్రాస్పెక్టస్ అండ్ అప్లికేషన్ ఫారము అడ్మిషనుకు పంపబడును.

**Principal, B.T. and T.T. College, Brodipet, Guntur-2 (Regd. By Govt)**

## ప్రొద్దుటూరు మునిసిపాలిటి

### సవరణ నోటీసు

11—9—65 వ తేదీ గల ఆంధ్రపత్రిక యొక్క రెండవ పేజీలోని మొదటి కాలములో ప్రకటించబడిన టౌను ప్లానింగ్ స్కీము నెం. 4 యొక్క నోటిఫికేషనులో ఈ దిగువ ఉదహరించబడిన సవరణను గమనించవలెను.

"ఆంధ్రప్రదేశ్ టౌను ప్లానింగ్ 49 వ రూలు క్రింద ఆంధ్రప్రదేశ్ గజెట్‌లో 29—7—65వ తేదీన" అనుటకు బదులు "ఆంధ్రప్రదేశ్ టౌను ప్లానింగ్ 49 వ రూలు క్రింద ఆంధ్రప్రదేశ్ గజెట్‌లో 4—7—63 వ తేదీన" అని యుండవలెను.

(సం) పి. ఆర్. మోహన్ రావు,

సెక్రటరి ఇన్‌ఛార్జి, ప్రొద్దుటూరు.



# దక్షిణ రైల్వే-గుంతకల్లు డివిజన్

## టెండరు నోటీసు నెం. 105

ఈ క్రింద తెలుపబడిన పనులకుగాను వేర్వేరుగా సీలువేయబడిన టెండర్లు డివిజనల్ సూపరింటెండెంటు/వర్క్సు బ్రాంచి, దక్షిణరైల్వే, గుంతకల్ వారిచే 16—11—65 తేదీ సా. 3—00 గంటలవరకు కోరబడుచున్నవి.

| వ నెం. | పని పేరు | పనియొక్క సుమారు విలువ | ధరావతు సొమ్ము | టెండరు ఫారము ఖరీదు |
|---|---|---|---|---|
| 1. | గుంతకల్లు—1వ వైపు (డాబావైపు) సిబ్బంది నివాసగృహములు 4 యూనిట్లు నిర్మించుట. | రు. 12,200/— | రు. 305/— | రు. 10/— |

| | |
|---|---|
| టెండరు ఫారము యొక్క ఖరీదును డివిజనల్ పేమాస్టర్, దక్షిణ రైల్వే, గుంతకల్ వారికి చెల్లించుటకు ఆఖరు తేదీ, కాలము | 15—11—65 తేదీ ఉ. 11 గంటలు |
| డివిజనల్ సూపరింటెండెంటు/వర్క్సు బ్రాంచి, దక్షిణరైల్వే, గుంతకల్ వారిచే టెండరు ఫారములు జారీచేయబడు ఆఖరు తేదీ, కాలము | 15—11—65 తేదీ మ. 12 గంటలు |
| ధరావతు సొమ్మును డివిజనల్ పే మాస్టర్, దక్షిణరైల్వే, గుంతకల్ వారివద్ద దాఖలుచేయుటకు ఆఖరుతేదీ మరియు కాలము | 15—11—65 తేదీ మ. 3—0 గంటలు |
| టెండర్లు తెరువబడు తేదీ : | 16—11—1965 తేదీ సా. 3—30 గంటలు |

ఇతర వివరములు మరియు టెండరు ఫారము (బదిలీకు వీలుపడదు) ను టెండరు ఫారము యొక్క ఖరీదును (తిరుగుబడని రసీది) డివిజనల్ పే మాస్టర్, దక్షిణరైల్వే, గుంతకల్ వారికి గాని లేక దక్షిణ రైల్వేలోని ఏ స్టేషన్‌మాస్టర్‌కైనను గాని చెల్లించి పొందిన రశీదును డివిజనల్ సూపరింటెండెంట్ (వర్క్సు), దక్షిణ రైల్వే, గుంతకల్ వారివద్ద దాఖలుచేసి పొందవచ్చును.

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

## పబ్లిక్ వర్క్సు శాఖ

### చిల్ టెండరు నోటీసు మరల పొడిగింపబడినది

ఈ దిగువ ఉదహరించిన పనులకు టెండర్లు తీసికొను తేది 16—11—65 సాయంకాలము 4 గంటలవరకు పొడిగింపబడినది.

టెండరు ఫారములు తే 15—11—65 ది వరకు ఆఫీసు పనిచేయు దినములలో ప్రతి దినము ఉదయము 11—00 గం. మొదలు సాయంకాలము 5 గంటలవరకు అమ్మబడును.

టెండరు ఫారముల కొరకు దరఖాస్తులు తేది 14—11—65 వరకు తీసికొనబడును.

టెండర్లు శ్రీ విశాఖపట్నం, పి. డబ్ల్యు. డి. సూపరింటెండింగు ఇంజనీరు వారి కార్యాలయములో తేది 16—11—65 సాయంకాలము 5 గంటలకు వచ్చిన టెండర్లు తెరువబడును.

మిగిలిన షరతులు మొదట ప్రకటించిన టెండరు నోటీసులలో నున్నవాటికి ఎట్టి మార్పులున్ను లేక అట్లే యుంచబడును.

| సం. | పని యొక్క పేరు | మొదట ప్రకటించిన మరియు పొడిగింపబడిన టెండరు నోటీసు |
|---|---|---|
| 1. | విశాఖపట్నంజిల్లా, చోడవరం తాలూకాలోని గొట్టివాడవద్ద మరియు గొవ్వాడవద్ద పెద్దేరుకు అడ్డముగా రాతికట్టుకాల్వ మొదలైన ఆనకట్టలు కట్టుట మరియు కాలువలు కట్టుట (అయిదు గ్రూపులు) | 1) 3528 GI 5—7—65<br>2) 4042 GI 3—9—65<br>3) 945 M 17—9—65<br>4) 4392 GI 8—10—65 |
| 2. | విశాఖపట్నంజిల్లా అనకాపల్లి తాలూకాలోని రంగబోలుగెడ్డపై అడ్డముగా రెగ్యులేటరు నిర్మించుట. | 1) 601 M 18—8—65<br>2) 943 M 17—9—65<br>3) 4392 GI 8—10—65 |

(సం) జి సుబ్బారావు,

సూపరింటెండింగు ఇంజనీరు, పి. డబ్ల్యు. డి. వాల్తేరు సర్కిలు, విశాఖపట్నం— 2.



కాశేశ్వరరావు మార్కెట్ ముందునుంచి మెయిన్ కెనాల్ ప్రక్కగా వెళ్లే విజయవాడ—హైదరాబాదు రోడ్డుపైన ట్రాఫిక్ దృశ్యం. సుమారు ఒకటిన్నర ఫర్లాంగుగా వున్న ఈ రోడ్డు దాటడానికి గంటకు పైగా పట్టడం ప్రయాణీకులకు నిత్యానుభవం.

# విజయవాడలో ట్రాఫిక్ దుస్థితి

[ఆంధ్రపత్రిక ప్రతినిధి] విజయవాడ, అక్టోబర్ 31 : విజయవాడ వంటి రద్దీ పట్టణం ఆంధ్రప్రదేశ్‌లో మరొకటి లేదేమో! హోటళ్ల దగ్గిర రద్దీ, రైళ్ళు, బస్సులలో రద్దీ; రోడ్లమీద మరీ రద్దీ. ఎక్కడ చూచినా రద్దీయే! ముఖ్యంగా యీ ట్రాఫిక్ రద్దీ పట్టణానికి ఒక సమస్య. పాలకులకు ఒక సవాల్.

దక్షిణాన ఉన్న కృష్ణానది, పశ్చిమాన ఉన్న పర్వతశ్రేణి పట్టణాన్ని కుదించి వేసింది. పట్టణ మధ్యలో నిర్మాణమైన రైలు మార్గం రాకపోకలను బంద్ చేసింది. మూడు కాలవల మధ్య విస్తరించిన విజయవాడ (2) భాగంలో అంతరాయం లేకుండా ప్రజలకు సౌకర్యం కలుగ చేయుటం అధికారుల సామర్థ్యానికి ఒక పరీక్షగా పరిణమించింది. జనసంఖ్య పెరిగి నంతవేగంగా రోడ్ల విస్తరణ కాకపోవటం, అధునిక విజ్ఞాన ఫలితంగా శరవేగంగా నడిచే యంత్రవాహనాల సంఖ్య పెరగటం రోడ్ల మీద రద్దీకి మరింత కారణమైనాయి.

## రైలు వంతెన

అన్నిచోట్ల పట్టణంలోని రెండుభాగాలనుకలిపేందుకు ఒక్కటే మార్గం. కాలవ మీద వేసిన రైలు వంతెన క్రిందుగా పట్టణ ట్రాఫిక్ అంతా నడవాలి. వంతెన క్రింద వెడల్పు 24 అడుగులు మాత్రమే. ఒక సొరంగంలో దూరినట్లు ... ఉంటుంది యిక్కడి ట్రాఫిక్. పట్టణ మధ్యలో రైలు మార్గ నిర్మాణానికి అప్పటి జిల్లా కలెక్టరు శ్రీ అరండేలు అంగీకరించలేదు. తరువాత రైలు పట్టాల మీద అవసరమైన చోట్ల అండరు పోవర్ బ్రిడ్జిలు నిర్మాణం చేయుటానికి పురపాలక సంఘం అంగీకరించింది. ఈ ప్రకారం జరిగినట్లయితే అంతరద్దీ ఉండేదికాదు. చివరకు సిమెంటు కంపెనీ వద్ద ఒక బ్రిడ్జి నిర్మించటానికి రైల్వే అధికారులు అంగీకరించారు. అది జరిగి ఇంద్రకీలాద్రి సొరంగం రోడ్డు నిర్మాణ మయినప్పుడు కొంత వరకు సాఫీగా రాకపోకలు నడవటానికి వీలుంటుంది.

అయితే యీ రైలు వంతెన క్రింది భాగాన్ని యిప్పుడు వెడల్పు చేసి రాకపోకలకు మరో రెండు మార్గాలు ఏర్పరుస్తున్నారు. పని పూర్తి అయింది. కాని యీ మార్గాలు ఉపయోగంలోకి వచ్చినంత మాత్రాన పరిస్థితి అంతా చక్కపడుతుందని అనుకోవటం పొరపాటు. ఇక్కడి రద్దీ అంతా ప్రకాశం విగ్రహం ముందున్న ఆర్చీల బ్రిడ్జి మీదికి తరలి పోతుంది. ఆ బ్రిడ్జికి రెండు వైపులా మరో రెండు బ్రిడ్జిలు నిర్మాణ మయితే తప్ప యీ రద్దీ తగ్గదు. 'మాస్టరు ప్లాను' నిర్మాతలు దీనిని గ్రహించి తమ నివేదికలో పొందుపర్చారు.

## కాశేశ్వరరావు మార్కెట్టు

కాశేశ్వరరావు మార్కెట్టు ముందురోడ్డు ఒక లారీ 'డాం'గా తయారయింది. గుంటూరు—హైదరాబాదు నగరాలకు వచ్చే పోయే వాహనాలన్నీ యీ రోడ్డు మీదుగా నడవాల్సిందే. సరుకులు దింపుకోటం, ఎత్తుకోటం, బాడుగలకు ఆపుకోటం మూలాన యిరవైనాలుగు గంటలు యిక్కడ లారీలు నిలిచే ఉంటాయి. అందుచేత రాకపోకలు దుస్సాధ్యం. నడవటమే కష్టసాధ్యం. ఈ రోడ్డును వెడల్పు చేయాలని, యీ రోడ్డుకు ముందుగా కాలవ ప్రక్కనున్న బోటు రేవును అక్కడి నుంచి తరలించటానికి, యిదివరలో ఆలోచనలు జరిగాయి. కాని ఎందుకో ఫలించలేదు. ప్రస్తుత మున్న 'బోటురేవు రోడ్డునే' లారీల రాకపోకలకు ఉపయోగించుకోవాలని నిశ్చయింప బడింది. కాని అది కూడ యింతవరకు జరగటంలేదు.

## 1 వ టౌన్

టౌను ప్లానింగుశాఖ పుట్టకముందే పుట్టింది యీ ప్రాంతం. ఒక పద్ధతిలో నిర్మాణం కాలేదు. 'కర్తలేని' క్రియా స్వరూపం యీ ప్రాంతం. 'కర్మ' అనుభవిస్తున్నాం. పెద్ద వాహనాల సంగతి అటుంచి సైకిళ్ళు, రిక్షాలు, లాగుడు బండ్లు దాటకే తట్టుకోలేకుండా ఉన్నాం. నడవటానికే సందు ఉండదు. ... లక్కడే నిలిచింది. వ్యాపార బాహుళ్యం కూడ అక్కడే. ఉన్న సందులను బాగు చేయటం సాధ్యం కాకపోవచ్చు. అందువల్ల ఆ ప్రాంత ప్రజానీకం యితర ప్రాంతాలకు తరలించటం ఒక్కటే మార్గంగా కన్పిస్తున్నది. సిమెంటు కంపెనీ దగ్గరకు పోవర్ బ్రిడ్జి ఏర్పడి టన్నెల్‌రోడ్డు నిర్మాణం పూర్తి అయితే విద్యాధరపురం నుండి కొత్తపేట మీదుగా సత్యనారాయణపురానికి రాజమార్గం ఏర్పడినప్పుడు యిక్కడి రద్దీ తగ్గి యితర ప్రాంతలకు చెదరి పోవచ్చు. అంతేకాక నూతన 'హోల్ మార్కెటు భవనం' పూర్తి అయితే టోకుల వ్యాపారం యిక్కడి నుండి తరలి పోయేట్లు యితర ముఖ్య వ్యాపారం కూడ యిక్కడి నుండి కొంత తరలిపోతే రద్దీ తగ్గుతుంది.

## 2 వ టౌన్

ఈ ప్రాంతం అంతా మూడు కాలవల మధ్య భాగంలో విస్తరించినా 'అరండేలు పేట' ధర్యాన కొంత పద్ధతి ప్రకారం అభివృద్ధి అయింది. అయినా అనుకోనంతగా యీ ప్రాంతం పెరగటంలో రాకపోకలు ఉగిసించగా ఏర్పడలేదు. రోడ్లు విశాలంగా నిర్మాణం కాలేదు. రోడ్లకు అనుకొనే పెద్ద భవన నిర్మాణాలు జరిగాయి. చాలా చోట్ల కాలిబాటలు లేవు. ఉన్నవైనా ఉపయోగపడటంలేదు. కొనుకో పోయు గుంట మెట్లంతో అసౌకర్యంగా ఉన్నవి కొన్ని, దుకాణాలు, సైకిళ్లతో నిండిపోయి నడవటానికి చోటు లేకుండా ఉన్నవి కొన్ని. నిలారు

(మిగతా 3 వ పేజీలో)

## ఏజంట్లు కావలయును

ఈ క్రింది ఊళ్ళలో ఆంధ్రపత్రిక, సచిత్ర వారపత్రిక భారతులను వారి స్వంత బాధ్యతపై విక్రయించుకొనుటకు న్యూస్ వెండర్లు కావలెను.

| ఊరు : | జిల్లా : |
|---|---|
| పెనుబల్లి | — ఖమ్మంమెట్ |
| ఆలేర్ | — వరంగల్లు |

మేనేజరు, ఆంధ్రపత్రిక

## మరణము

వంకదారు సత్యనారాయణ (క్లాత్ ఓనర్స్) 25—10—65 సోమవారం తెల్లవారుఝామున 4.30గం. మరణించారు. భవానీపురం, శివగిరిపల్లి వెంకటనారాయణగారి వసతిగృహంలో పెద్దకర్మ 4.11.65న జరుపబడును. వి. బలరామ్, వి. కృష్ణ

## EDUCATIONAL

"Revenue Test Part I & Criminal Judicial Tests (Andhra Pradesh) Questions / Answers for All Parts Available. Apply Account Test Institute-Madras-8.

## కవి గానము

110 వేలు; 50 వెయ్యేండ్ల రోజా మను ఉంగ్రాన్ని ... గ్రంథాల్లో ఏటా సభల్లో నీవు; బ్రస్ట్రాటు 22 పై. రామచంద్రరావు, బ్రాడీ 1/15, గుంటూరు.

చంద్రమాంపల్లి గ్రామ పంచాయతీ

## టెండరు నోటీసు

"మా గ్రామములోని పనులు చేయించుటకు సీలు వేయబడిన టెండర్ల కొరకు 12—10—65 నుండి 8—11—65 సా. 4గం.వరకు పొడిగించడమైనది." వివరములకు పంచాయితీ కార్యాలయములో తెలుసుకొనవచ్చును.

దాసంశెట్టి నాగరాజు, సర్పంచ్.

## విజ్ఞప్తి

ఆర్యులారా !

మిక్కిలి అధిక సంఖ్యాకులచే నన్ను పర్ త్యాగరాయ విద్యాసంస్థల ధర్మకర్తృత్వ సంఘ సభ్యునిగా ఎన్నుకొనినందులకు పై సంస్థల పూర్వ విద్యార్థులైన మీ కెల్లరికిని నా కృతజ్ఞతను తెల్పుచున్నాను. శ్రీ కాళహస్తి. (ఉరఫ్) చెంగల్వరాయం.

12, ఆరుముగ మొదలి వీధి, మద్రాస్—21.

## భారత ప్రభుత్వము

### అండమాన్ అటవీశాఖ

### సవరణ నోటీసు

తేది 10—11—1965న జరుపదలచిన కలప వేలములు 13—11—1965 తేదీకి వాయిదావేయబడినవి. వేలము జరుగు స్థలము, కాలములయందు ఏ మార్పులు లేవు.

జె. కె. మెహతా,

అసిస్టెంటు కన్‌సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స్, అండమాన్ గవర్నమెంటు టింబరుడిపో

ఫోన్ : 23795 తంతి : Gurjan మద్రాస్—9





ప్రమాదానికి గురి అయ్యేలాగా నడుస్తున్న లారీలు

దక్షిణ భారత హిందీ ప్రచారసభ

# "మధ్యమ" పరీక్షా ఫలితాలు

హైదరాబాద్, నవంబర్ 3 : 1965 ఆగస్టులో దక్షిణభారత హిందీ ప్రచార సభ వారు నిర్వహించిన "మధ్యమ" పరీక్షలో ఈ క్రింది నంబర్లుగల అభ్యర్థులు ఉత్తీర్ణులైనారు

## ఫస్ట్ క్లాస్

6939 75 84 88 7004 05 77 163 65 68 82 85 207 39 45 75 84 305 06 73 98 413 14 15 75 86 502 43 62 73 76 630 92 795 823 44 46 54 70 73 74 80 84 924 25 54 69 8039 51 60 75 100 01 214 17 19 49 90 441 52 60 554 76 618 33 34 92 716 26 34 35 39 93 802 26 63 903 27 30 59 9025 30 49 106 32 62 80 83 84 86 93 నుంచి 98 210 67 70 81 352 67 74 86 92 451 54 56 77 81 505 72 613 16 27 45 57 69 73 90 96 706 18 22 40 94 876 81 85 944 53 85 10101 07 11 50 85 239 41 57 60 76 99 366 75 77 78 85 86 96 400 02 20 30 41 42 43 45 46 524 651 52 55 705 06 51 71 78 801 960 85 93 11001 31 35 99 113 14 33 79 95 248 52 57 90 302 412 39 49 81 97 507 12 17 688 93 712 23 33 34 36 37 39 40 41 44 50 58 63 78 86 895 926 30 34 50 53 88 90 93 నుంచి 97 12009 42 76 93 101 16 47 292 326 34 38 46 423 79 94 502 13 27 35 38 54 62 84 89 94 95 638 712 32 72 85 89 91 93 96 98 966 86 88 నుంచి 92 96 13013 17 18 28 36 216 522 647 55 93 746 52 57 821 30 14045 75 76 మరియు 126.

## సెకండ్ క్లాస్

6864 66 70 71 76 80 82 83 84 87 నుంచి 90 94 95 97 99 6901 02 03 05 06 10 11 13 15 16 17 22 నుంచి 31 37 40 నుంచి 47 49 58 59 62 64 67 70 71 76 77 79 82 83 85 87 89 90 93 95 97 99 7001 02 03 06 08 16 నుంచి 23 25 27 29 31 35 37 38 42 నుంచి 46 48 50 నుంచి 53 55 56 58 61 64 66 67 68 70 71 72 74 75 78 నుంచి 83 88 89 93 95 97 7100 03 04 05 08 09 10 12 15 16 18 32 33 37 38 42 43 44 49 50 51 54 55 60 62 64 67 69 70 73 74 76 77 79 80 83 84 90 92 నుంచి 98 7201 02 03 05 06 08 నుంచి 19 22 24 29 32 34 36 37 38 40 నుంచి 43 46 48 నుంచి 51 58 63 64 67 నుంచి 72 74 76 77 78 80 82 85 86 88 89 90 92 93 95 96 97 99.

7300 01 02 07 08 09 28 29 31 33 నుంచి 40 43 45 49 51 నుంచి 54 57 60 62 63 65 67 69 71 75 76 77 79 నుంచి 82 84 87 88 89 91 92 93 97 7400 నుంచి 05 07 10 18 నుంచి 23 26 30 నుంచి 34 36 38 39 42 43 44 46 48 55 56 58 60 61 63 66 నుంచి 70 72 77 79 81 84 85 88 90 నుంచి 93 96 97 98 7501 03 09 13 14 17 19 21 నుంచి 24 26 27 28 30 31 33 34 35 37 నుంచి 42 44 నుంచి 48 50 నుంచి 61 63 65 నుంచి 68 71 73 75 78 80 82 84 88 నుంచి 94 96 97 99 7600 నుంచి 04 06 07 08 10 12 13 16 నుంచి 25 27 29 31 నుంచి 34 38 39 41 42 48 50 51 52 57 59 60 62 నుంచి 67 69 71 72 78 83 89 90 91 95 96 7703 05 07 నుంచి 11 13 18 నుంచి 22 24 26 27 29 32 34 35 39 40 41 43 45 నుంచి 48 52 53 54 57 నుంచి 63 65 68 69 70 73 75 77 79 80 81 83 85 89 నుంచి 92 98 7800 02 04 06 09 నుంచి 12 14 15 16 19 22 24 26 28 29 30 35 నుంచి 42 45 50 నుంచి 53 58 63 66 68 69 71 76 77 79 81 83 86 87 88 90 92 94 96 98 99 7900 01 02 07 10 11 13 18 27 33 38 40 43 45 46 49 50 53 55 నుంచి 58 64 65 70 71 74 77 82 83 84 86 నుంచి 89 92 93 95 97 8003 06 11 నుంచి 14 16 నుంచి 19 24 26 28 29 33 నుంచి 38 42 44 48 52 53 55 56 57 61 63 65 67 69 70 73 74 76 77 80 నుంచి 83 86 87 88 94 98 8108 13 16 18 19 25 30 31 33 34 36 37 38 47 48 54 55 56 58 62 65 66 70 74 76 77 79 80 85 86 97 8203 05 07 08 11 12 13 18 22 నుంచి 25 28 31 39 40 41 44 52 55 57 60 66 67 68 70 71 74 75 82 84 87 88 89 95 8302 04 13 14 17 21 నుంచి 25 30 36 37 42 44 46 49 51 53 54 55 57 60 62 64 67 71 76 79 81 86 87 88 90 92 96 నుంచి 99 8403 నుంచి 07 13 15 17 20 22 23 25 26 27 29 31 33 నుంచి 40 42 43 45 48 నుంచి 51 53 నుంచి 59 62 65 నుంచి 71 73 74 81 82 84 85 86 88 నుంచి 91 93 94 96 నుంచి 99 8501 03 04 05 07 నుంచి 11 17 18 23 24 25 27 29 30 60 63 66 నుంచి 69 72 74 75 77 79 82 83 85 86 88 93 95 96 8600 03 09 10 12 14 15 16 20 22 25 26 31 32 35 36 38 39 43 52 53 54 61 64 65 66 77 79 81 93 8700 నుంచి 05 07 10 14 15 19 23 27 29 33 36 38 41 నుంచి 50 54 నుంచి 63 65 67 68 69 71 72 73 76 80 నుంచి 84 86 88 90 91 92 94 95 98 8803 నుంచి 08 16 20 21 23 25 34 36 39 నుంచి 42 46 53 54 55 64 66 72 78 83 నుంచి 86 89 91 94 96 97 98 8902 04 05 06 08 09 11 15 నుంచి 18 20 21 22 25 26 28 29 31 32 33 38 నుంచి 41 43 44 46 48 నుంచి 51 53 54 56 65 67 68 69 71 72 73 75 76 80 88 89 92 93 94 97 98 9002 03 04 09 10 13 15 16 20 22 23 24 26 29 31 32 33 35 నుంచి 43 45 46 48 50 నుంచి 53 57 60 64 70 నుంచి 77 79నుంచి86 88 89 96 97 99

9102 03 04 08 10 12 14 నుంచి 17 20 23 నుంచి 28 30 33 34 36 38 39 44 46 49 51 నుంచి 54 56 57 58 60 61 63 64 65 67 నుంచి 70 74 77 79 81 82 91 92 99.

9200 నుంచి 04 13 14 15 17 18 20 22 25 26 27 29 30 32 నుంచి 35 37 50 నుంచి 55 58 65 66 71 72 74 78 80 82 86 88 89 90 93 94 95 97 98.

9300 02 04 05 08 నుంచి 11 16 20 నుంచి 24 26 27 29 నుంచి 33 36 37 38 41 నుంచి 45 48 నుంచి 51 59 60 64 66 70 71 72 75 నుంచి 78 80 82 83 85 87 89 91 96 నుంచి 99.

9400 నుంచి 03 05 06 09 10 11 13 నుంచి 18 20 24 25 27 నుండి 35 37 40 నుంచి 46 48 50 53 55 57 నుంచి 61 63 65 69 71 72 74 75 76 78 79 80 82 83 84 87 88 91 92 94 96 97 98.

9500 01 02 04 07 నుంచి 15 17 18 20 24 25 29 30 31 33 34 39 40 42 43 47 50 51 54 57 59 63 64 65 71 76 77 80 82 83 85 89 90 92 96 97.

9600 02 04 06 11 17 18 21 22 24 26 29 31 32 35 38 నుంచి 41 43 44 48 49 50 55 59 62 64 నుంచి 67 74 76 82 86 91 92 94 98 99.

9700 01 03 07 నుంచి 12 15 16 17 21 24 25 27 30 32 33 41 నుంచి 44 46 48 50 51 52 56 58 63 66 నుంచి 69 72 74 76 77 79 80 82 84 85 87 90 91 92 95.

9801 02 03 05 06 09 నుంచి 12 16 నుంచి 26 28 నుంచి 31 34 నుంచి 41 44 45 46 48 49 50 52 53 56 65 68 70 నుంచి 75 77 80 82 83 86 87 89 నుంచి 93 95 96 97.

9900 02 05 06 07 12 13 14 19 నుంచి 30 32 33 35 39 40 42 43 45 నుంచి 49 51 52 54 59 60 61 63 68 69 71 75 77 83 86 నుంచి 93 95 నుంచి 99.

10000 01 02 09 10 11 14 15 16 21 22 27 29 31 నుంచి 35 37 నుంచి 42 45 46 47 51 52 54 55 56 58 59 60 64 66 69 70 71 73 నుంచి 76 78 79 81 నుంచి 85 87 నుంచి 90 93 94 95 97 99.

10100 02 03 05 06 08 10 12 16 19 20 21 24 25 26 28 30 32 నుంచి 35 37 40 41 42 46 51 56 57 61 63 65 66 67 71 72 74 నుంచి 79 84 86 88 89 91 నుంచి 94 97 98 99.

10205 06 07 09 10 16 నుంచి 19 27 32 33 36 42 44 45 52 56 58 59 61 64 నుంచి 67 71 72 73 75 82 85 87 90 91 92 94 96.

10302 03 07 10 11 13 14 28 నుంచి 32 40 44 47 48 49 51 నుంచి 55 57 నుంచి 61 63 64 65 67 నుంచి 74 79 81 నుంచి 84 87 88 89 91 93 95 97.

10403 05 06 09 14 15 17 18 19 21 నుంచి 26 28 29 31 33 34 36 38 39 44 47 50 51 52 55 56 57 60 62 నుంచి 70 76 79 82 నుంచి 85 88 91 93 94 95 98.

10501 05 07 08 11 14 నుంచి 17 19 నుంచి 22 25 నుంచి 28 30 33 35 36 37 40 41 43 నుంచి 46 48 నుంచి 53 55 57 60 61 62 65 66 74 75 80 82 83 84 86 89 91 94 95 96 98.

10601 04 06 07 08 10 11 13 14 15 18 19 25 27 28 29 31 33 35 38 42 48 49 50 53 54 57 58 60 నుంచి 65 68 69 70 72 నుంచి 75 78 79 80 84 87 94 95 98 99.

10702 03 04 13 17 నుంచి 21 30 32 37 39 42 45 46 48 49 50 53 55 57 58 60 61 62 65 66 69 72 73 75 76 81 నుంచి 91 94 నుంచి 98.

10800 06 14 19 21 22 24 25 27 30 31 33 34 37 38 39 41 నుంచి 45 48 50 51 58 67 69 70 71 78 79 80 82 87 90 95 96 97.

10901 02 05 06 07 09 14 18 19 21 25 26 39 40 44 నుంచి 47 49 50 51 54 59 61 63 67 68 70 72 73 75 నుంచి 78 81 86 నుంచి 89 95 నుంచి 99.

11004 05 06 14 15 16 19 20 21 23 25 27 నుంచి 30 32 33 34 36 నుంచి 42 46 48 52 53 54 56 57 58 61 68 80 84 88 89 90 93 94 95 97 98.

11100 01 02 08 నుంచి 11 16 18 20 21 22 24 26 29 నుంచి 32 34 35 37 నుంచి 43 45 నుంచి 48 50 51 54 56 61 64 68 72 74 75 77 83 85 నుంచి 90 92 96 99.

11203 05 07 నుంచి 11 15 17 18 19 22 25 నుంచి 28 30 34 36 37 38 46 47 49 54 55 56 58 61 62 63 65 68 నుంచి 71 79 80 84 87 88 92 96 99.

11301 06 10 11 13 నుంచి 18 20 23 27 30 31 35 36 37 40 41 45 నుంచి 49 53 56 58 నుంచి 61 64 72 74 75 78 83 84 87 89 93 94 97 99.

11405 08 11 15 18 19 20 29 30 32 33 40 41 43 నుంచి 46 51 52 55 56 59 65 72 73 76 77 78 83 85 నుంచి 93 98 99.

11500 నుంచి 06 08 నుంచి 11 13 14 16 21 23 నుంచి 30 32 33 34 36 నుంచి 49 51 55 59 60 61 63 66 67 70 నుంచి 73 75 76 77 80 84 97.

11602 03 06 08 09 12 14 నుంచి 20 22 23 24 26 28 31 నుంచి 35 38 39 40 42 46 నుంచి 53 57 58 59 61 62 63 67 70 72 77 79 83 85 86 91 92 94 నుంచి 97.

11703 నుంచి 08 10 11 13 నుంచి 22 27 28 30 31 32 35 38 42 43 49 51 54 55

(మిగతా 3 వ పేజీలో)



ఢిల్లీ పౌరసంఘంవారు ఇటీవల న్యూఢిల్లీలో ఏర్పాటుచేసిన సర్దార్ పటేల్ జయంత్యుత్సవాలకు అధ్యక్షత వహించిన రాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణన్ సర్దార్ పటేల్ చిత్రాన్ని పుష్పమాలలతో అలంకరించారు.

భారత్ - పాక్ సంఘర్షణ సహా వివిధ సమస్యలపై

# విరామ తీర్మానాలకు అనుమతి నిరాకరణ

## సభాపతి ఆదేశం: శుక్రవారంనాడు లోక్‌సభలో ప్రధాన మంత్రి ప్రకటన

న్యూఢిల్లీ, నవంబర్ 3:

భారత పాకిస్తాన్ సంఘర్షణ, ప్రధానమంత్రికి అమెరికా అధ్యక్షుని ఆహ్వానం, వివిధ రాష్ట్రాలలో అనావృష్టి పరిస్థితి మున్నగు విషయాలపై ప్రతిపక్ష సభ్యులు నేడు లోక్‌సభలో ప్రతిపాదించిన అనేక విరామ తీర్మానాలను సభాపతి శ్రీ హుకుంసింగ్ త్రోసివేశారు.

ఈ సమస్యలను వెంటనే పరిశీలించకపోతే, దేశానికి నష్టం వాటిల్లదని సభాపతి తన తీర్పులో చెప్పారు. ఈ విషయాలను మరో రూపంలో సభ చర్చించవచ్చునన్నారు.

ఈ నెల 5 వ తేదీన తాను సభలో ప్రకటన చేయనున్నట్లు ప్రధాన మంత్రి వెల్లడించారు.

పాకిస్తాన్‌కు అమెరికా ఆయుధ సహాయాన్ని కొనసాగిస్తున్నందునను, భారత్‌లో కాశ్మీర్ విలీనంపై అమెరికా అనిశ్చిత విధానం వల్లను అమెరికాకు రావలసిందని జాన్సన్ పంపిన ఆహ్వానాన్ని ప్రధానమంత్రి ఆమోదించడంపై చర్చ జరపాలని శ్రీ హెచ్. ఎన్. ముఖర్జీ మున్నగు కమ్యూనిస్టు వర్గ సభ్యులు కోరారు.

ప్రధాన మంత్రి ఆమోదాన్ని గురించి వార్తా పత్రికలలో విభిన్నవార్తలు వచ్చాయనీ, ప్రధాన మంత్రే 'అవును' 'కాదు' అని ఒకే దఫా చెప్పినట్లు కనపడుతున్నదనీ శ్రీ ముఖర్జీ అన్నారు. అమెరికా ఆహ్వానాన్ని ప్రధాని కొద్ది నెలల క్రితమే తిరస్కరించారనీ, ఇలాంటి దేశ ప్రతిష్టకు సంబంధించిన విషయాలపై పార్లమెంట్‌ను ప్రధాని తమ విశ్వాసంలోనికి తీసుకోవాలనీ అన్నారు.

చైనా, పాకిస్తాన్‌లతో సంఘర్షణ సమయంలో దేశంలో పూర్తి ఐకమత్యం అవసరం కాగా, పంజాబీ సుబా సమస్యపై మంత్రివర్గ ఉపసంఘాన్ని ఏర్పాటు చేయడంలో గల ఔచిత్యాన్ని చర్చించాలని స్వామి రామేశ్వరానంద్ అన్నారు.

వివిధ రాష్ట్రాలలో అనావృష్టి పరిస్థితిని చర్చించాలని శ్రీ కె. పట్నాయక్ తమ విరామ తీర్మానంలో కోరారు.

యుద్ధ విరమణ రేఖను పాకిస్తాన్ ఉల్లంఘించే సమస్యను చర్చించాలని శ్రీ మధులిమాయే కోరారు. పాకిస్తాన్‌తో భారత దేశానికి ఇది మూడవ యుద్ధ విరమణ అని, ఈ మారు దీనిని పాకిస్తాన్ సరిగా అమలు చేయకపోతే భారతదేశం గట్టి చర్యలు తీసుకోవాలన్నారు.

సింధు నదిపై కట్టడాల పునర్నిర్మాణానికయ్యే ఖర్చును భారతదేశం భరించరాదని, మనం ఇచ్చిన ధనాన్ని మన పైనే యుద్ధానికి తయారయ్యేందుకు వినియోగపరచారని శ్రీ ప్రకాశ్‌వీర్ శాస్త్రి చెప్పారు.

---:o:---

# ఆఫ్రోఏషియన్ సమైక్యత

## భారత్‌పై చైనా ఆరోపణ

హాంగ్‌కాంగ్, నవంబర్ 3: ఆఫ్రో—ఆసియన్ సమైక్యతకు హానికలిగించే విధంగా భారత్ కుట్రపన్నుతున్నదని చైనా ఆరోపించింది.

నవచైనా వార్తాసంస్థ నిన్న ఒక వార్తలో ఇలా పేర్కొన్నది:

"చాలకాలంవరకు రెండవ ఆఫ్రోఏషియన్ సభ నిర్వహణలో అడ్డుపడడానికి భారత ప్రభుత్వం శతథా ప్రయత్నిస్తూ వచ్చింది. కాని ఆఫ్రోఏషియా దేశాలలో ఈ సభ నిర్వహణ విషయంలో కొన్నిచిక్కులు ఎదురయినందువల్ల, ఆ దేశాల మధ్య ఇప్పట్లో పరిష్కారం కాజాలని కొన్ని విభేదాలు తలఎత్తినందువల్ల భారతప్రభుత్వం అకస్మికంగా తన వైఖరి మార్చుకొని మహాసభ యథాకార్యక్రమం ప్రకారం జరగాలని వత్తిడి చేస్తున్నది."

"పాకిస్తాన్, చైనా, ఉత్తర కొరియా, ఉత్తర వియత్నాం, కంబోడియా, టాంజానియా, గినీ, బ్రాజవిల్, కాంగోవంటి కొన్ని దేశాలు మహాసభ వాయిదాను కోరడంతో భారత్ అధికారులలో చైతన్యం కలిగింది. అల్జీరియాలో భారత్ ప్రతిపాదనకు అమెరికా మద్దతు ఇచ్చింది."

# కూరగాయలు, కోళ్ల పెంపకానికి విస్తృత ఆర్థిక సహాయం

## —రాష్ట్రాలకు కేంద్రం హామీ

బొంబాయి, నవంబరు 3:

కూరగాయలు, పండ్లు ఉత్పత్తి పెంపుదలకు చేపలు, కోళ్ళ పెంపకం అభివృద్ధికి రాష్ట్రాలకు "అపరిమితంగా" ఆర్థిక సహాయం అందజేయాలని కేంద్ర ప్రభుత్వం నిశ్చయించినదని కేంద్ర సమాజాభివృద్ధి సహకార శాఖామంత్రి శ్రీ ఎస్. కె. డే నేడిక్కడ వెల్లడించారు.

శ్రీ డే ఇక్కడ రాష్ట్రాల సహకార మంత్రుల వార్షిక సమావేశంలో ప్రసంగిస్తూ సమాజంలో బీద వర్గాలన్నింటిని కూడగట్టి సహకార సంస్థలద్వారా ఈ కార్యక్రమాన్ని నిర్వహించేందుకు ప్రత్యేకంగా కృషి చేయాలన్నారు.

దేశం స్వయం పోషకత్వం సాధించాలంటే ముందు సహకార సంఘాలు స్వయం పోషకమైనవి కావాలని ఆయన అన్నారు,

ఈ ఏడాది వర్షాభావం వల్ల ఏర్పడిన ఆహార ధాన్యాల కొరతను తీర్చేందుకై మూడు నుంచి ఆరు నెలల కాలంలో సం. డే. ... ఉత్పత్తి పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపాలని ఆయన కోరారు.

ప్రతి సోమవారం ఒక పూట భోజనం మానివేయవలసిందిగా జాతికి ప్రధాని చేసిన విజ్ఞప్తి ఆయన ప్రస్తావిస్తూ ఈ విజ్ఞప్తితో ఆహార ధాన్యాలు పొదుపు చేయడం కంటె ఎక్కువ గాఢమైన అర్థం కలదని, ప్రధానమంత్రి విజ్ఞప్తిని ... రాష్ట్రాల సహకార శాఖల మంత్రులకు ... చెప్పారు.

# రష్యాచే బృహత్తర రోదసీనౌకప్రయోగం

మాస్కో, నవంబర్ 2— 12 టన్నులకు పైగా బరువుకల బృహత్తర రోదసీ నౌక "ప్రోటాన్"— 2ను రష్యానేడు విజయవంతంగా అంతరిక్ష కక్ష్యలోకి ప్రయోగించింది.

ఇతవరకు ప్రయోగించిన రోదసీ నౌకలన్నిటికన్నా ఇది బరువైనది.

---:o:---

# మొహినుద్దీన్‌కు సుప్రీంకోర్టు అప్పీల్‌కు అనుమతి నిరాకరణ

హైదరాబాద్, నవంబర్ 2: పౌర విమాన శాఖ ఉపమంత్రి శ్రీ అహ్మద్ మొహినుద్దీన్, తన పార్లమెంటు ఎన్నికపై ఎన్నికల ట్రిబ్యునల్ తీర్పు విూద సుప్రీం కోర్టుకు అప్పీలు చేసుకొనడానికి ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు డివిజనల్ బెంచి నేడు అనుమతి నిరాకరించింది.

న్యాయమూర్తులు బాపిరెడ్డి, అనంత నారాయణన్‌లు యీ డివిజన్ బెంచిలో ఉన్నారు. ఈ డివిజన్ ఉత్తర్వును "నిలుపు చేయు"మని పెట్టుకున్న పిటిషన్‌ను కూడా వారు త్రోసిపుచ్చారు. అప్పీలుకు ప్రత్యేక అనుమతి యివ్వగల కారణాలేవీ లేవని వారు అన్నారు.

# ఏడెన్‌లో బ్రిటన్ సైనికచర్యలు సమితికి 38 రాజ్యాల విజ్ఞప్తి

ఐక్యరాజ్యసమితి, నవంబర్ 3: ఏడెన్ ప్రజలపై బ్రిటన్ సైనికచర్య ... పరిస్థితులను ... ఉనికి ... 38 ఆంధ్ర రాజ్యాల ప్రతినిధులు నిన్న ఐక్యరాజ్యసమితిలో ఒక ముసాయిదా తీర్మానం ప్రతిపాదించారు.

సమితి ధర్మకర్తృత్వ సంఘానికి సమర్పించబడిన తీర్మానం ఈ భూభాగంలో ప్రజాప్రాతినిధ్య రహితమైన పాలనను ప్రవేశపెట్టడానికి బ్రిటన్ చేస్తున్న యత్నాల పట్ల విచారం వ్యక్తం చేసింది. 1968 నాటికి ఏడెన్‌కు స్వాతంత్ర్యం ఇవ్వాలని తాము అనుకొంటున్నట్లు బ్రిటన్ ప్రకటించింది.

ఈ భూభాగంలో సైనిక స్థావరాలన్నింటినీ వెంటనే పూర్తిగా తొలగించాలని, ఈ స్థావరాలు వలస పాలన నుంచి అక్కడ ప్రజలకు విముక్తి కలుగచేయడానికి అవరోధంగా వున్నవని, ఆ ప్రాంతం ప్రజల శాంతి, భద్రతలకు అవి హానికరమని విబంధ రాజ్యాలు తమ ముసాయిదా తీర్మానంలో పేర్కొన్నవి.

ఏడెన్‌లో అత్యయిక పరిస్థితిని తొలగించాలని, ప్రజల స్వేచ్ఛను అరికట్టే శాసనాలన్నింటినీ తొలగించాలనీ, ఆ ప్రాంతం ప్రజలపై అన్ని నిర్బంధాలకు, ముఖ్యంగా సైనిక చర్యలకు, స్వస్తిచెప్పాలని, రాజకీయ ఖైదీలందరిని విడుదల చేయాలని బ్రిటన్‌ను ఈ తీర్మానంలో కోరడం జరిగింది.

# యూరప్ భద్రతకు సమిష్టి పరిష్కారం

## ఫ్రాన్స్, రష్యా ప్రకటన

మాస్కో, నవంబరు 3: ఐరోపా భద్రత సమస్యలకు సంబంధించి, అన్నిదేశాలకు ఆమోదయోగ్యమైన పరిష్కారంసాధించాలని ఫ్రాన్స్, సోవియట్ రష్యాలు నిన్న విజ్ఞప్తి చేశాయి.

సోవియట్‌రష్యా అగ్రనాయకులకు, ఫ్రాన్స్ విదేశాంగమంత్రికి మధ్య జరుగుతున్న చర్చలు ముగిసిన తర్వాత నిన్న వెలువడిన సంయుక్త ప్రకటనతో ఈ విజ్ఞప్తి చేయబడింది.

అన్ని ఐరోపా దేశాల మధ్య సంబంధాలను మామూలు పరిస్థితికి తెచ్చినట్లయితే, ఐరోపా అంతటా సహకారం ఏర్పడేందుకు అనువైన పరిస్థితులు ఏర్పడతాయని సంయుక్త ప్రకటనలో పేర్కొన్నారు.

భువనేశ్వర్, నవంబరు 3—ఒరిస్సా శాసనసభలో, ఒరిస్సా ప్రభుత్వం ... చేయటానికి నిర్ణయం చేసింది. ... ముఖ్యమంత్రి శ్రీ ... ఉపముఖ్యమంత్రి శ్రీ ... శ్రీ ... తెలుపుతారు.

# వాషింగ్టన్‌లో ఒక వ్యక్తి ఆత్మాహుతి

## యుద్ధతంత్ర కార్యాలయం వద్ద సంఘటన

వాషింగ్టన్, నవంబర్ 3—18 మాసాల పసి బాలికను చేతిలో వుంచుకుని నిన్న అసుర సంధ్య వేళ ఒక యువకుడు ఇక్కడ అమెరికా యుద్ధ తంత్ర కార్యాలయం భవనం మెట్ల వద్ద, తనకు నిప్పుపెట్టుకున్నాడు. అతడు తర్వాత ఆస్పత్రిలో మరణించాడు. ఆ బాలికను కూడా ఆస్పత్రికి తీసుకు వెళ్లారు. అయితే ఆమె గాయపడలేదు.

నిప్పుపెట్టుకున్న వ్యక్తి నార్మన్ ఆర్. మోరిసన్ (31) గా గుర్తుపట్టారు. అతని ఉద్దేశాలు తెలియకుండానే అతడు మరణించాడు. వియత్నాంలో యుద్ధానికి నిరసనగా ఇతడు ఈ చర్యకు పూనుకున్నట్లు విశ్వసిస్తున్నారు. కార్యాలయ సిబ్బంది తమ ఇండ్లకు వెడుతున్న సమయంలో ఈ సంఘటన జరిగింది.

ఆ వ్యక్తి దొర్లిపోవడంతో ఆ బాలిక కిందపడిపోయినట్లు, ఈ సంఘటన చూచిన ఒక సైనికాధికారి చెప్పారు.

ఆ వ్యక్తి మండే ద్రవాన్ని మీద పోసుకుని ఏదో అంటుండగా మంటలు వ్యాపించాయని ఆ సైనికాధికారి చెప్పారు. ఆ ద్రవం వున్న పాత్ర తర్వాత అక్కడ కనుగొన్నారు.

---:o:---

# సమితి నిధికి భారత్‌చే 30 లక్షల డాలర్ల విరాళం

సమితి కార్యాలయం, నవంబర్ 3: ఐక్యరాజ్య సమితి ప్రత్యేకనిధి, అభివృద్ధి చెందుతున్న దేశాలకు సాంకేతిక సహాయ కార్యక్రమాలకు భారత్ 30 లక్షల డాలర్ల విలువైన రూపాయలను ఇవ్వటానికి సంసిద్ధత తెలిపింది.

ఈ మొత్తాన్ని రూపాయలుగానే ఖర్చు పెట్టవలసి వుంటుంది.

మొత్తం 99 దేశాలు 15 కోట్ల డాలర్ల మేరకు ఇలాంటి వాగ్దానాలు చేశాయి.

1966 లో కార్యక్రమాలకు మొత్తం 20 కోట్ల డాలర్లు ఖర్చుకాగలవని సమితి ప్రధాన కార్యదర్శి ఊథాంట్ అంచనా వేశారు.

... నవంబరు 2: ... ఆఫ్రో ఏషియన్ ... సమావేశం ... ఎస్. ... ఉన్నారు.

# ట్రాఫిక్ దుస్థితి

(1 వ పేజీ తరువాయి)

... మెయిన్ రోడ్లలో రాకపోకలు దుస్థితి వల్ల ప్రజలకెంతో అసౌకర్యం కలుగుతోంది. ... ఏలూరు రోడ్డు మీద ... ప్రమాదాలు ... సంభవిస్తున్నాయి. ... ప్రకాశం రోడ్డు, గోపాలరెడ్డి రోడ్డు వంటి మార్గాలను కాలిబాటలు సరిగాలేక పోవటంతో ప్రజలు రోడ్ల మీదనే నడవవలసి వస్తోంది. మితిమీరిన వాహనాల వేగానికి హడలి పోతున్నారు. బందరు రోడ్డు కొంత విశాలంగా వున్నా ఆ రోడ్డు మీద వాహనాలు అమిత వేగంతో పోతాయోమో ఆ రోడ్డు మీద కూడ ప్రమాదాలు ఎక్కువగా వింటాము.

## సూచనలు

రోడ్ల మీద రద్దీ తగ్గించటానికి ప్రజలు రోడ్ల మీద నడవటం అవసరం లేకుండా కాలిబాటలు నిర్మించటం ఉన్నచోట్ల ఆక్రమణలను నిర్దాక్షిణ్యంగా తొలగించటం అవసరం.

అవకాశమున్న చోట్ల రోడ్లు విశాలం చేయటం రోడ్లమీద ఉన్న కూరగాయల మార్కెట్లను భవనాలలోకి మరలించటం, బందరు రోడ్డు మీదగా పట్టణంలో ప్రవేశించి నేరుగా పోయే వాహనాలను బెంజి కంపెనీ సమీపంలో నిర్మించిన రహదారి బ్రిడ్జి మీదుగా కృష్ణలంక రోడ్డు మీదుగా తరలించే అవకాశం పరిశీలించటం, అలాగే ప్రభుత్వ కళాశాలవద్ద ఒక రహదారి బ్రిడ్జి నిర్మాణంచేసి ఏలూరువైపు నుండి పట్టణంలో ప్రవేశించే సరాసరిపోయే వాహనాలను అలంకారటాకీసు ముందురోడ్డు మీదుగా తరలించటం, పట్టణంలో తిరిగే ట్రాఫిక్ 'వచ్చే మార్గం ఒకటి' పోయే మార్గం 'వేరొకటి'గా ఏర్పాటు చేయటం ఎంతో అవసరం. పట్టణంలో అవసరమైన ప్రాంతాల్లో కాలవలమీద మరికొన్ని రహదారి వంతెనలు కాలినడక రిక్షా వంతెనలు నిర్మాణం చేయటం కూడ అవసరం. పట్టణం విస్తరించి పోతున్న కారణంగా కొత్త రోడ్ల నిర్మాణం కూడా జరగాలి. లేకపోతే ఒక ప్రాంతానికి మరొక ప్రాంతానికి కలయిక లేక 'అనావాటిల్యాత్ బ్రహ్మ' అను మాట ... అవుతుంది.

... ఇప్పటివున్న ... ఎప్పుడో ... లేకపోతే "..." ... ఉన్నాయి.

# పరీక్షా ఫలితాలు

(2 వ పేజీ తరువాయి)

56 59 62 65 67 నుంచి 72 74 75 77 79 నుంచి 82 84 85 89 92 నుంచి 96 98 99.

11802 04 05 06 09 నుంచి 13 15 నుంచి 21 23 26 నుంచి 31 33 నుంచి 36 40 42 43 49 50 52 నుంచి 57 61 63 64 67 69 70 72 81 83 నుంచి 89 91 92 93 96 98.

11900 06 07 12 14 19 22 24 27 28 31 32 38 నుంచి 44 48 49 52 55 57 నుంచి 60 62 68 71 72 74 నుంచి 81 83 84 85 89.

12000 03 04 08 11 12 14 16 18 నుంచి 22 24 25 27 30 33 49 62 66 69 71 72 73 84 85 87 88 91 95 97 98.

12102 04 నుంచి 07 10 13 [illegible]5 20 21 23 25 27 28 30 31 33 42 45 48 58 63 65 66 67 70 71 72 75 76 78 81 83 87 89 90 92 93 94 96 97 98.

12203 05 06 07 10 13 14 17 35 38 40 41 42 45 48 49 50 56 61 63 65 66 68 నుంచి 77 79 80 87 89 91 95 97.

12301 04 నుంచి 07 09 13 16 18 19 20 22 24 25 28 30 33 36 37 40 41 42 45 48 51 53 నుంచి 59 61 62 65 [illegible]7 68 70 72 73 76 77 81 85 86 89 91 93 96 98.

[illegible]2400 01 06 08 09 12 [illegible]7 20 21 24 25 27 28 [illegible] 36 37 38 40 నుంచి [illegible]47 49 50 52 నుంచి 58 [illegible]65 68 నుంచి 72 74 [illegible] 82 83 86 87 88 90 [illegible]5 నుంచి 99.

12501 03 నుంచి 07 10 11 12 14 16 నుంచి 19 21 22 23 28 29 31 32 34 36 37 41 42 45 47 48 49 52 53 56 నుంచి 61 63 72 78 80 83 90 91 96.

12600 01 03 06 08 10 12 13 16 17 18 20 23 25 26 27 30 నుంచి 33 37 39 నుంచి 43 45 50 51 54 నుంచి 57 60 65 68 69 71 73 74 76 78 80 81 83 87 88 89 92 94.

12703 05 07 08 17 33 38 40 41 43 46 నుంచి 51 53 56 58 నుంచి 62 64 66 67 68 73 నుంచి 84 86 87 88 90 92 94 95 97 99.

12800 03 05 09 నుంచి 17 20 నుంచి 26 29 31 33 35 36 38 40 45 64.

12923 24 25 43 45 46 48 50 52 53 54 56 58 నుంచి 65 67 నుంచి 70 72 73 84 87 94 95 98 99.

13001 03 04 05 08 10 15 20 22 23 25 29 నుంచి 33 35 38 40 53 62 64 68 81 82 85 87 89 90 92 93 94 96.

13105 10 11 17 18 19 23 24 25 32 నుంచి 36 38 39 40 42 43 46 47 48 53 56 నుంచి 63 68 69 71 నుంచి 74 76 77 79 87 నుంచి 90 92 95 97 98 99.

13200 నుంచి 03 07 09 12 15 18 29 30 35 37 41 43 47 48 49 51 52 55 56 62 70 71 72 75 81 82 84 92 నుంచి 95 99.

13300 01 03 04 09 13 నుంచి 16 18 20 21 23 25 నుంచి 33 37 40 42 44 47 నుంచి 52 67 69 71 72 78 79.

13400 26 29 34 35 37 40 42 46 51 55 56 64 66 69 71 నుంచి 74 82 86 87 91 93.

13501 03 నుంచి 09 14 15 18 19 20 23 24 27 29 30 31 33 నుంచి 36 46 నుంచి 49 51 52 53 56 57 60 61 71.

13601 11 12 13 15 16 20 22 29నుంచి33 36 38 40 48 52 53 54 60 63 68 69 70 72 73 78 నుంచి 83 87 88 90 92 98.

13702 04 05 07 10 నుంచి 13 18 21 22 23 26 29 30 32 33 35 36 38 41 42 45 47 51 60 61 62 65 66 70 71 76 86 87 88 90 91 92.

13801 06 07 08 11 16 22 23 25 29 31 నుంచి 34 43 47 48 58 నుంచి 62 64 68 72 76 78 81 85 87 88 90 91 92 95 99.

13900 01 04 05 06 10 11 13 నుంచి 16 18 20 21 22 26 28 29 31 33 నుంచి 39 42 44 45 46 49 నుంచి 52 54 నుంచి 64 66 68 69 71 73 80 83 90 92 94 96.

14011 23 24 25 27 30 31 32 35 37 39 40 41 48 51 52 54 58 63 64 77 78 90 91.

14104 06 నుంచి 09 11 నుంచి 15 17 19 21 23 24 27 29 33 46 49 54 61 నుంచి 66 69 74 86 89 90 99.

14202 07 12 13 15 17 18 22 25 26 28 30 నుంచి 31.

## గంటల పంచాంగం

శ్రీ విశ్వావసునామ సం. కార్తీక శు॥ ఏకాదశి 1965 సం. నవంబరు 4 గురువారం గురు॥ ఏకాదశి : పూర్తి ; ... ఉ. 9—48; వర్జ్యం: సా. 4—46 మొదలు 6—30 వరకు.

1965 సం. నవంబరు 5 శుక్రవారం శుక్ర॥ ఏకాదశి : ఉ. 6—38 ; పూ. భా : ప. 11—55 ; వర్జ్యం: రా. 10—11 మొదలు 11—54 వరకు.



ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబునకగు దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథములకెల్లన్.
(మహాభారతము)

శ్రీ విశ్వావసునామ సం. కార్తీక శు॥ ఏకాదశి
గురువారం

## చిన్ననీటి వనరుల్లో- కేంద్రం వైఖరి

ఆహారోత్పత్తికి గాని, వ్యవసాయాభివృద్ధికి గాని పెద్ద ప్రాజెక్టులతో గాక, చిన్నతరహా మధ్య రకం నీటి పారుదల సౌకర్యాలను ఎక్కువగా సమకూర్చడం వలం అనుకొన్న ఫలితాలు తొందరగా ఒనగూడి వస్తాయన్నది నిర్వివాదమైన విషయం. పెద్ద ప్రాజెక్టులు అంటూ పెట్టుకొన్నప్పుడు అవి ఉపయోగంలోకి వచ్చే సరికి చాలా కాలం పడుతుంది. పైగా నిర్మాణం వ్యవహారం కూడా అనేకరకాలైన ప్రతిబంధకాలకు లోనౌతూ ఉండడం కద్దు. మన రాష్ట్రంలో నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఇందుకు ప్రథమ ఉదాహరణం.

అయితే పెద్ద ప్రాజెక్టుల నిర్మాణంలో ఉండే ఉపయోగం వద్దని ఇది. ఎక్కువగా కొత్త భూములను సాగులోనికి తీసుకొని రావడం ఈ ప్రాజెక్టుల నిర్మాణం వలన సాధ్యమవుతుంది. ఈ ప్రాజెక్టుల ఆయకట్టు ప్రాంతంలో గాని, విస్తరణ ప్రాంతంలోగాని చిన్న తరహా నీటి వనరులకు గాను నిర్మాణపు పనులు సాగిస్తే, అనంతరం అవి పనికి రాక, డబ్బు వృథా అయిందే అన్న అభిప్రాయానికి దారి తీయవచ్చు. అందువల్ల కొందరు పెద్ద ప్రాజెక్టుల నిర్మాణమే ప్రశస్తమని భావిస్తున్నారు. ఇది నిజమే కావచ్చు కాని పనులు తొందరగా జరగవు.

అందుకే మన ప్రణాళికలలో చిన్న తరహా నీటి వనరులకు, మధ్య రకం ప్రాజెక్టులకు కూడా ప్రాధాన్యం ఇస్తూ వచ్చాము. ఆహార పరిస్థితి విషమం అవుతున్న కొద్దీ చిన్న తరహా నీటి వనర్ల ఆవశ్యకత అధికంగా గుర్తించబడింది. నాలుగు సంవత్సరాల క్రిందట కేంద్ర ప్రభుత్వమే ఈ సంగతిని బాగా మనస్సుకు పట్టించుకొన్నది. చిన్న నీటి వనర్ల అభివృద్ధికి గాను రాష్ట్రాలకు అదనంగా సహాయం చెయ్యడానికి కూడా సంకల్పించింది. రాష్ట్రాలను ఈ విషయమై హెచ్చరించను కూడా హెచ్చరించింది.

ఆ నాలుగు సంవత్సరాల క్రిందట, ఈ ఆలోచన ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో చిన్ననీటివనర్ల అభివృద్ధికి 7 న్నర కోట్ల రూపాయలు దాకా సహాయం చెయ్యగలదని కేంద్రం వాగ్దానం చేసింది. ఆ వాగ్దానాన్ని దృష్టిలో పెట్టుకొని, రాష్ట్ర ప్రభుత్వం ఈ రకం కార్యక్రమాలపై దాదాపు 10 కోట్ల రూపాయలు దాకా వెచ్చించింది. ఇందులో రు 7 న్నర కోట్లు "ఓవర్ డ్రాఫ్ట్" అని కేంద్రం వాగ్దానం దృష్ట్యా ఈ ఓవర్ డ్రాఫ్ట్ తీసుకోబడినదని ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానంద రెడ్డి హైదరాబాద్‌లో జరిగిన ఆహారోత్పత్తి గోష్ఠిలో మాట్లాడుతూ వెల్లడి చేశారు.

కేంద్ర ప్రభుత్వం ఇస్తానన్న సహాయాన్ని ఇవ్వ లేదని, వాగ్దానభంగం జరిగించినకూడా ముఖ్యమంత్రి అన్నారు. నాలుగు సంవత్సరాలు క్రింద ఇచ్చిన మాటను కేంద్ర ప్రభుత్వం నిలబెట్టుకోలేకపోయిందంటే, అందులోనూ ఆహార పరిస్థితి విషమం అవుతున్న సందర్భంలో ఇది ఇట్లా జరిగిందంటే ఎమనాలో అర్థం కాకనే ముఖ్యమంత్రి దీనిని వాగ్దానభంగంగా అభివర్ణించి ఉంటారు. నిజం చెప్పాలంటే ఈ జరిగిన పని అంతకన్నా విపరీతమైనదనే చెప్పవలసి ఉంటుంది.

దీనినిబట్టిచూస్తే కేంద్రంలో అధికోత్పత్తిని గూర్చి మాటల్లో చూపబడుతున్నంత శ్రద్ధ, చేతల్లో చూపబడటం లేదని వ్యక్తం అవుతున్నది. ఇప్పుడు కూడా కేంద్రం చిన్న నీటి వనర్ల అభివృద్ధిని గురించి మాట్లాడటం జరుగుతూనే ఉన్నది. ప్రధాన మంత్రి దగ్గర నుండి, నీటి పారుదల మంత్రి దాకా ఈ విషయాన్ని గురించి మాట్లాడుతున్నారు. చిన్న నీటి వనర్ల ప్రాముఖ్యాన్ని గురించి ఉద్బోధలు, ఉద్ఘోషణలు చేస్తున్నారు కాని పనులు సానుకూలంగా జరిగేట్లు మాత్రం వ్యవహరించడం లేదు. నాలుగు సంవత్సరాల క్రిందటివాగ్దానంవిషయంలోఒక రాష్ట్రం అనుభవం ఇట్లా ఉన్నప్పుడు, తక్కిన రాష్ట్రాల అనుభవం కూడా ఇంతకన్నా మెరుగ్గా ఉన్నదని ఎట్లా అనగలం? కొత్త వాగ్దానాలు సరిగ్గా అమలు కాగలవని ఎట్లా భావించగలం?

ఇప్పుడు ఈ వ్యవహారం ఇట్లా జరగడాన్ని కేంద్ర ప్రభుత్వం, ప్రణాళికా సంఘం వారు కూడా పరిశీలన చెయ్యవలసి ఉంది తలపెట్టిన పనులు తలపెట్టినట్లు జరిగితే, ఉభయత్రా సుఖంగా ఉంటుంది. లేకపోతే క్లేశాలు ఏర్పడటమే గాక, పనులు అనుకొన్నట్లు జరగవు. అందువల్ల దేశం నష్టపడుతుంది. కాబట్టి ఇప్పుడు ఆంధ్ర ముఖ్యమంత్రి వెల్లడించిన తబ్బిబ్బులను గూర్చి సత్వరం పరిశీలనం జరిపించి, ముందు ముందు ఇటువంటి వాగ్దానాలు సవ్యంగా నిర్వర్తించగలందులకు తగువిధానాన్ని, పద్ధతిని ఏర్పాటు చేసుకొనడం అవసరమై గోచరిస్తున్నది.

—:o:—

## 'నా ప్రాణాలకే ముప్పువచ్చింది' సుకర్నో వెల్లడి

సింగపూర్, నవంబర్ 3—తన ప్రాణాలకే ప్రమాదం పొంచివున్నట్లు ఇండొనేసియా అధ్యక్షుడు సుకర్నో తన మంత్రివర్గ మండలికి చెప్పారు.

"ఐతే నేనది బాగు చేయని దేశానికేది మంచిదో అదే చేస్తాను" అని ఆయన అన్నట్లు జకార్తా రేడియో ప్రసారం చేసింది.

పరిస్థితుల నడుపులోకి తెచ్చే విషయంలో తన సహచరుల కృషి సంతృప్తికరంగా లేదని, పరిణామాలు విషమంగా వుంటాయనే భయం వుండకుండా, ఎదుర్కొనవలెనని శ్రీ సుకర్నో అన్నారట.

# కాబూల్‌లో సరిహద్దు గాంధి-7

**జీవనసాయం సంధ్యలోను ఉత్సాహం రూపు కట్టినట్లు బాద్‌షాఖాన్ మరల ఖుదాయి ఖిద్మత్‌గార్ ఉద్యమం ప్రారంభించదలచారు తమ పాత కాలపు సాధనాలతోనే తం లక్ష్యాలను సాధించదలచుకున్నారు. ఇదొక ఆశ్చర్యం! ఈ ఆశ్చర్యోత్సాహాలలోను రేఖామాత్రంగా ఆయనలో కనిపించే నిర్వేదం భారతదేశం తమను గాలికి వదలిపెట్టినదని, తం వాగ్దానాలు నిలబెట్టుకోలేదనన్నీ. పఖ్తూనిస్తాన్ నిర్మాణానికి గాంధీజీ చేసిన వాగ్దానం పూరించే బాధ్యత భారతదేశంది అని బాద్‌షాఖాన్ అంటున్నారు ఈ ఆఖరి వ్యాసంలో శ్రీ ప్యారేలాల్ బాద్‌షాఖాన్ ఉత్సాహ నిర్వేదాలను యథాతథంగా వర్ణించారు.**

" "మీరు ప్రస్తుతోద్యమం నిర్వహించడంలో ఎదుర్కొంటున్న కష్టాలేమిటి?" అని ప్రశ్నించాను.

"మొట్టమొదటి చిక్కు స్వార్థపరులు. వారికి ప్రజాస్వామ్యమంటే కొంచెం జడుపు. కనుక నేనన్నా భయమే. ఈ భయాన్ని స్వార్థపరులముఠాలు క్రమబద్ధంగా ప్రచారం చేస్తున్నాయి. అయితే, ప్రజలలో విశ్వాసం త్వరగా చేకూరుతూంది. "మీరు ఖానులుగా వుండగూడదని మా అభిమతంకాదు. ఇతరులు కూడా ఖానులు కావడానికి తోడ్పడాలి. దాని వల్ల భయపడుతున్నారా?" అని ఖాన్‌తోనే అన్నాము. "అప్పు: మాకు ఏలాటి భయమూ లేదు." అని వారు సమాధానం చెబుతారు. అని బాద్‌షాఖాన్ ఉత్సాహంతో అన్నారు.

"ప్రజలు పూర్తిగా మా వైపు ఉన్నారు" అంటూ ఆయన ఇంకా ఇలా చెబుతూపోయారు, "భారత్‌లో నేను పర్యటించినప్పుడు, బాలురు, బాలికలు, స్త్రీలు, పురుషులు నన్ను చూడడానికి తండోపతండాలుగా మిద్దెలమీద, మేడలమీద, చెట్లమీద కూడా ఎక్కి వేచిఉండడం మీరు చూచే ఉంటారు. వారు నావద్దకు వచ్చినప్పుడు నేను వారితో మీరు నాదీదార్ (దర్శనం) కోసం వచ్చారు. నా చేతులు ముద్దుపెట్టుకొని, నాకు షుక్రానాలు (నజరానాలు) ఇవ్వడానికి వచ్చారు. వాటివల్ల మీకు సవాబ్ (పుణ్యం) వస్తుందని మీకు ఎవరో చెప్పారు. ఇదంతా మీ విశ్వాసాన్ని, అమాయకతను తమ స్వార్థానికి వినియోగించుకొనడానికి కొందరు చేసే దుష్ప్రచారం. నాకు ఇవేవీ అక్కరలేదు. మీకు సేవ చేయాలన్నదొక్కటే నా వాంఛితం. మీరు ఖుదాయి ఖిద్మత్‌గార్లు కావడానికి తగిన విషయాలు బోధించడమన్నదే నా వాంఛ. ఎందుకంటే అల్లా సృష్టించిన జీవులకు సేవ చేయడం ద్వారా తప్ప అల్లాను సేవించడం సాధ్యంకాదు." అని నేను వారితో అంటుంటాను.

"ఇప్పుడు మీరు ప్రారంభించిన ఉద్యమం పూర్వం మీరు వాయువ్య సరిహద్దు రాష్ట్రంలో నడిపిన ఉద్యమంలాగ ప్రజాదరం పొందుతున్నదా? లేక మార్పేమైనా ఉన్నదా?" అని ప్రశ్నించాను.

ఆయన ఇలా అన్నారు: "మార్పున్నది. ఇప్పుడు పొందుతున్న ప్రజాదరం మునుపటికన్న గొప్పది. పూర్వం ఉద్యమాల్లో ప్రజలేమో బ్రిటిష్ పరిపాలనవల్ల అవినీతిపరులు, చిత్తస్థైర్యంలేనివారు, బానిసబుద్ధితో బాధపడేవారు. ప్రస్తుతం మాతో పనిచేసేవారు వక్రబుద్ధి లేనివారు, ముందు వారితో పోలిస్తే అవినీతి లేనివారు. వారు స్వాతంత్ర్యంలో పెరిగినవారు. కనుక నా పని చాల సులువయింది. ప్రజలు తమకు తామే మా ఉద్యమాన్ని ఆదరిస్తున్నారు."

"అయితే, వారికి క్రమశిక్షణ అలవరచడం నిదానమూ, కష్టమూ కాదా?" అని ప్రశ్నించాను. "వారు యోధులు కావడంవల్ల ఇది సరకే క్రమశిక్షణ నేర్చుకున్నారు. మేము చేయవలసిందల్లా దానికి అహింసాత్మకమైన రూప మివ్వడమే" అని ఆయన జవాబు చెప్పారు.

"భారత్ మీ లక్ష్యాన్ని అవలంబిస్తే మీకు వ్యక్తిగతంగా ప్రమాదం కలుగదా? మీకూ పాకిస్తాన్‌కువుండే సమాధానావకాశాలు పోవా?" అని నా మనసులో మెదిలే భయాన్ని మాటలలో తెలియజేశాను.

"నాకు సంబంధించినంతవరకు పాకిస్తాన్‌తో తెప్ప తగలేశాను. ఇక పాకిస్తాన్‌కు తిరిగి వెళ్లను. ఇక పాకిస్తాన్‌తో సమాధానపడే అవకాశముంటే, పూర్తిగా శూన్యం" అని ఆయన అన్నారు.

"నేను అన్ని విధాల ప్రయత్నించి విఫలుణ్ణయాను. ఆఖరుకు విధిలేక నేను నిర్ణయించుకొన్న దేమిటంటే, పాకిస్తాన్ చక్కబడవు రానిదని. భారతదేశం ఒకటికాదు, అరడజను కాశ్మీర్‌లను ఇచ్చినా, పాకిస్తాన్‌తో శాంతి నెలకొనదు. నా విశ్వాసం పూర్తిగా చెల్లాచెదరైపోయింది. పాకిస్తాన్‌తో ఇక నాకు ఏలాటి ప్రసక్తి వుండదనే అనుకుంటున్నాను. 'విజయమో, వీరస్వర్గమో'—పఖ్తూనిస్తాన్‌ను సాధించడమో సాధిస్తాను. లేక దాని కోసం పోరాడుతూ అసువులన్నా అర్పిస్తాను" అన్నారు బాద్‌షాఖాన్.

"భారతదేశానికి వచ్చే ఉద్దేశమేమైనా ఉందా?" అని అడిగాను.

"పఖ్తూనిస్తాన్ లక్ష్యానికి సహాయం చేస్తా

**శ్రీ ప్యారేలాల్**

ని భారతదేశం వాగ్దానంచేస్తే, పఖ్తూన్‌ల లక్ష్యాన్ని తన లక్ష్యంగా భావిస్తే, భారతదేశానికి వస్తాను" అని ఆయన సమాధానం చెప్పారు.

"ప్రజాభిప్రాయాన్ని మీ లక్ష్యానికి అనుకూలంగా చేసుకోడానికి భారతదేశానికి రాగూడదా?" అని ప్రశ్నించగా, "అది భారత ప్రభుత్వం వైఖరిపై ఆధారపడి ఉంటుంది. అంతేకాక, నేను ఆఫ్ఘనిస్తాన్‌లో మొదట చెప్పదగినదేదో సాధించాలని ప్రత్యేక దీక్షతో వున్నాను" అని అంటూ, గాంధీజీని అమెరికాకో, ఇంగ్లండుకో ఆహ్వానించినప్పుడు అన్న మాటలను సరిహద్దుగాంధి ఉదాహరిస్తూ ఇలా అన్నారు:—"నేను మొదట నా స్వదేశంలో తగిన ఫలితాలు చూపలేనప్పుడు, ఏదేశంలో పరాభిప్రాయం కలిగించలేనుకుంటాను—అని గాంధీజీ అనేవారు. సహాయానికి అమెరికాకో, మరొక దేశానికో వెళ్ళవలసిందని సూచించేవారికి బాద్‌షాఖాన్ సమాధానం కూడ ఇదే.

భారత్, ఆఫ్ఘనిస్తాన్‌లు తనతో పూర్తిగా సహకరిస్తే, పఖ్తూనిస్తాన్ సమస్య వెలుపలి సహాయం అవసరం లేకుండా, పోరాటమనేది లేకుండా పరిష్కారమవుతుందని బాద్‌షాఖాన్ అభిప్రాయపడుతున్నారు.

"భారత్ ఏ విధంగా మీకు తోడ్పడగలదు?" అని ప్రశ్నించాను.

"ఈ సమస్యకు సంబంధించిన వారిపై తన శాయశక్తుల నైతికమైన, ఆర్థికమైన, రాజకీయమైన ఒత్తిడిని కలిగించడం మూలంగా భారతదేశం తోడ్పడగలదు. భారత్ పఖ్తూన్ల సమస్యను తమ ప్రధాన సమస్యగా భావించి చేయదగినదంతా చేస్తుందని దేశవిభజన సమయంలో గాంధీజీ చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకొని గౌరవం దక్కించుకోవలసి వుంది" అని ఆయన జవాబిచ్చారు.

నేను నా తిరుగు ప్రయాణాన్ని జూలై 29 వ తేదికి బుక్ చేసుకున్నాను. మా సంభాషణలు ఇంకా పూర్తి కాలేదు గనుక బాద్‌షాఖాన్ కోరికపై ప్రయాణం మరుసటి వారానికి వాయిదా వేసుకున్నాను. నేను మరికొన్నాళ్ళు వుండిపోతే ఆయన సంతోషించేవాడే. "మా తిరుగు ప్రయాణానికి రోజు కూడా నిర్ణయించుకున్నారు. నేను ఒంటరిగాణ్ణి అయిపోయాను గదా అని అప్పుడే అనుకోడం ఆరంభించాను" అని ప్రయాణంనాటి ముందటి రాత్రి అన్నారు. ఇప్పుడిక ఉపవులు లేవు చాలు గనుక ఇక చాలకాలం ఆయనను ఒంటరిగా వుండనివ్వనని అన్నారు. ఆయన కోరిక ప్రకారం అరియానా ఎయిర్‌లైన్స్ విమానంలో ఏర్పాటు చేసుకున్న ప్రయాణం రద్దు చేసుకుని, మరుసటిరోజు ఇండియన్ ఎయిర్‌లైన్స్ విమానంలో వెళ్లడానికి ఏర్పాటు చేసుకున్నాను. అయితే, జూలై 30 వ తేదీ వాతావరణం అనుకూలంగా లేనందున విమానం రాకపోకలు రద్దయాయి. కనుక నేను జూలై 31 వ తేదీన కాబూల్ వదలవలసి వచ్చింది.

### బరువైన గుండెతో వీడ్కోలు

కాబూల్‌లో స్వాతంత్ర్య దినోత్సవం కోసం పెద్ద ఎత్తున ఏర్పాట్లు సాగుతున్నాయి. సాయుధ దళాల అధికుని నైనిక శకటాల ప్రదర్శనం కారణంగా నేను బయలుదేరవలసిన రోజున తెల్లవారుఝామున నుంచే వీధులలో రాకపోకలు ఆగిపోయాయి. అందువల్ల మా దౌత్య కార్యాలయం కారు ఎక్కడెక్కడో తిరిగి ఆలస్యంగా వచ్చింది. నేను సెలవు తీసుకుంటున్నప్పుడు నా మనసులో అన్నిటికన్నా ఎక్కువగా పైకి వచ్చిన భావమేమిటంటే, ఆ ఖుదాయీ ఖిద్మత్‌గార్ తొణికిసలాడే ఆశాభావం ఉత్సాహమే ఆశ్చర్యం, విస్మయం. "తన జీవితమే అంకితం చేసిన లక్ష్యాల ధ్వంసం చూడడం కారాగారం కటకటాల వెనుక నుంచి గాయపడ్డ హృదయంతో పరిశీలించినవాడయినా, ఇప్పుడు, తన జీవిత సంధ్యలో, విఘ్నాలు, అడ్డంకులు విశేషంగా ఎదుర్కొంటున్నా, సరకు చేయక, నిరుత్సాహపడక "ఆ పాత సాధనాలతోనే మరల ఆ లక్ష్యాల సాధనకు ప్రయత్నిస్తున్నాడు" ఎంతటి అసాధారణ వ్యక్తి!

భారతదేశం స్వాతంత్ర్యం అనుభవిస్తూ, స్వాతంత్ర్య సంపాదనకై తనకు తోడ్పడిన వారిని మరచిపోవడమే కాక, వారికి స్వాతంత్ర్యం లేకుండా చేసింది అనే ఆక్షేపణ, కోపంతోకన్నా దుఃఖంతో చేసిన ఈ ఆక్షేపణ, నా చెవులలో గింగురుమంటున్నది. నేను విమానంలో తలవంచి వినోబాజీ గీతావాక్యాలలో అన్నట్టు "మిత్రులను, సహచరులను వంచించిన మహాపాపం నుంచి మేము తప్పించుకొనలేము"ని ఒప్పుకున్నాను.

భారతదేశం ఇంతకుముందు నిర్వ్యాపారంగా వుండడానికి కారణాలున్నాయి. కాని పరిస్థితులు మారాయి గనుక, భారతదేశం తన బాధ్యతలను గుర్తించడంలో ఏమారదని వాటిని నిర్వర్తించడానికి తన శాయశక్తులా కృషి చేయగలదని నాకు విశ్వాసం వుంది.

— సమాప్తం —

## రక్షణ ఉత్పత్తుల సమన్వయ సాధన

### హాథీ అధ్యక్ష్యాన ఏర్పరచిన కొత్త శాఖ కార్యక్రమం

న్యూఢిల్లీ, నవంబరు 3 : శ్రీ జైసుఖ్‌లాల్ హాథీ అధినేతృత్వాన ఇటీవల ఏర్పాటు చేయబడిన రక్షణ సరఫరాలశాఖ, ముఖ్య కార్యక్రమం, రక్షణ పరికరాల ఉత్పత్తి సమన్వయమేనని తెలుస్తున్నది.

రక్షణ వస్తువులలో దేశం స్వయంశక్తివంతం కావాలన్న తమ విధానాన్ని అనుసరించి ప్రధాని ఈ కొత్తశాఖను ఏర్పాటు చేశారు.

ప్రైవేటు, ప్రభుత్వ రంగాలలోని పరిశ్రమలను రక్షణోపయోగ్యంగా చెయ్యటం ఎలాగోకూడా ఈ శాఖ పరిశీలిస్తుంది. ఒకే రకమైన వస్తువులు ఎక్కువసార్లు తయారు కాకుండా చేయటానికి, విదేశీమారకం పొదుపయ్యేవిధంగా దిగుమతులు తగ్గించే యుంగా ఉత్పత్తి సాధించటానికి కూడా ఈ శాఖ ప్రయత్నిస్తుంది.

సరఫరాల, పంపిణీల డైరెక్టర్ జనరల్ తోను, సాంకేతికాభివృద్ధి డైరెక్టర్ జనరల్ తోనూ, తదితర అధికారులతోనూ ఈ శాఖ సన్నిహిత సంబంధాలను కలిగివుంటుంది.

ఈ శాఖకు ఒక కార్యదర్శి, కొద్దిపాటి సిబ్బంది సౌకర్యాలు ఉంటాయి.

ఆర్థిక, రక్షణ సమన్వయ శాఖలోనూ సరఫరాలశాఖలోనూ శ్రీ హాథీ చేసిన కృషి దృష్ట్యా, ఆయనకు ఈ కొత్తశాఖను ప్రధాని అప్పగించారు.

గతశుక్రవారం కొత్తశాఖ అధికారం స్వీకరించిన శ్రీ హాథీ రక్షణ మంత్రిత్వశాఖ అధికారులతో ప్రాథమిక చర్చలు జరిపినట్లు తెలుస్తున్నది.

# తుంగభద్ర దిగువకాల్వ నీటి మట్టం నిర్వహణ

## ప్రాజెక్టు బోర్డుదే బాధ్యత అని మైసూర్ ప్రభుత్వ ప్రతినిధి వివరణ

బెంగుళూరు, నవంబర్ 3—తుంగభద్ర ప్రాజెక్టు దిగువ కాల్వలో నీటిమట్టం మైసూర్ ప్రభుత్వం సమృద్ధిగా వుంచడం లేదని, ఈ సందర్భంలో కేంద్రం జోక్యం చేసుకోవాలని కోరుతూ ఇటీవల ఆంధ్రప్రదేశ్‌లో చేస్తున్న ఫిర్యాదులు నిరాధారమైనవని, వాస్తవం తెలియకుండా చేసిన వ్యాఖ్యలని మైసూర్ ప్రభుత్వ ప్రతినిధి ఒకరు నిన్న ఇక్కడ పేర్కొన్నారు.

రిజర్వాయర్ కుడివైపునుంచి వెళ్లే దిగువ కాల్వ మైసూర్, ఆంధ్రప్రదేశ్ రెండింటికీ నీరు సరఫరా చేస్తున్నది.

ఈ కాల్వ ఉభయ రాష్ట్రాలకు ఉమ్మడిగా వున్నందున దానిని తుంగభద్ర ప్రాజెక్టు బోర్డు నిర్వహిస్తున్నదని, ఆ బోర్డు అధ్యక్షుని కేంద్రం నియమించిందని ప్రభుత్వ ప్రతినిధి పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ చెప్పారు.

కాల్వనీటి పారుదల గురించి ఏదైనా ఫిర్యాదు వుంటే, అది బోర్డు వారిపై జరగవలసిందే నని, కాల్వనీటి మట్టం విషయంలో మైసూర్ ప్రభుత్వానికి ఏమీ సంబంధం లేదని ఆయన చెప్పారు.

ఈ ప్రాజెక్టు ముఖ్య లక్ష్యం నీటి పారుదల కాగా, బోర్డువారు ఎక్కువ నీటి విద్యుదుత్పాదనకు వదులుతున్నారని, అందుచే నీటి పారుదల దెబ్బతింటోందని, అందుచేత మైసూర్‌కు ఇబ్బందిగా వుందని, ఈ సందర్భంలో తమకే ప్రాజెక్టు బోర్డుపై సరియైన ఫిర్యాదు వుందని ప్రభుత్వ ప్రతినిధి అన్నారు. రాష్ట్ర ప్రభుత్వం ఈ విషయమై బోర్డుకు ఫిర్యాదు చేసిందని ఆయన అన్నారు.

ఒప్పందం ప్రకారం ఇరు వైపులాగల కాల్వలకు రోజుకు వ్యవసాయానికి, విద్యుత్పాదనకు 1800 క్యూసెక్కుల నీరు విడుదల చేయడానికి అనుమతించబడినదని ఆయన అన్నారు. అయితే, ఆంధ్ర ప్రయోజనం దృష్ట్యా అధిక విద్యుదుత్పాదనకోసం, వాస్తవానికి 4000 క్యూసెక్కుల నీరు విడుదల అనుమతించబడుతున్నదని ఆయన వివరించారు. వ్యవసాయదారులు దెబ్బతింటున్నందున, అదనంగా విడుదలచేసే 35 వేల శతకోటి ఘనపుటడుగుల నీరు విడుదల నిలిపివేయవలసిందిగా ప్రభుత్వం ప్రాజెక్టు బోర్డును కోరినట్లు ఆయన తెల్పారు.

విద్యుదుత్పాదనకు అధికంగా నీరు విడుదల చేస్తున్న ప్రాజెక్టు బోర్డు చర్య పర్యాలోచన చేయవలసిన అంశమని, ఆ చర్య ప్రాజెక్టు ప్రాథమిక లక్ష్యంకాదని ఆయన పేర్కొన్నారు.

ప్రాజెక్టు బోర్డు సమావేశం నీటినుంచి ఇక్కడ 3 రోజులు జరుగుతుంది. దిగువ కాల్వ సంరక్షణ, ఇతర పనులకు 163 లక్షల రూపాయలు వ్యయం కాగల ఒక పథకం ఈ సమావేశం చర్చనీయాంశాలలో వుంది. ఈ అంశం కార్యక్రమంలో చేర్చినందుకు మైసూర్ ప్రభుత్వం హర్షిస్తున్నదని ఆయన చెప్పారు. నీటిని సంరక్షించే పథకం కావున అది ... అని ఆయన అన్నారు.

### తుంగభద్ర నీరు : కర్నూలు కలెక్టర్ వివరణ

కర్నూలు, నవంబర్ 3—తుంగభద్ర దిగువ కాల్వనుంచి రెండవ పంటకు నీటి సరఫరా విషయంలో రైతులు అపోహ పడనక్కరలేదని కర్నూలు జిల్లా కలెక్టరు శ్రీ జి. ఆర్. నాయర్ మొన్న ఇక్కడ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ చెప్పారు.

కర్నూలు—కడప కాల్వ ఆయకట్టు క్రింద జిల్లాలో పంటల పరిస్థితి మామూలుగానే వుందని ఆయన అన్నారు. అయితే వర్షాభావం వల్ల జిల్లాలో ముంగారి పైర్లు దెబ్బతిన్నాయని ఆయన వివరించారు.

## మండలిలో భుట్టో ప్రలాపాలు

### పాకిస్తాన్ పశ్చాత్తాపపడనిస్థితి : భారత్‌పై ఆరోపణలు

ఐక్యరాజ్యసమితి, నవంబర్ 3 : గత వారంలో భద్రతా మండలిలో భారత్‌పై నిందారోపణలు చేస్తూ భుట్టో నీచమైన పదజాలాన్ని వాడడంవల్ల పాకిస్తాన్ పశ్చాత్తాపపడిన వైఖరి ఏమీ కానరావడంలేదు.

భుట్టో వాడిన పదజాలానికి అభ్యంతరం చెబుతూ భారత ప్రతినిధి శ్రీ పార్థసారథి వ్రాసిన లేఖకు పాక్ రాయబారి అంజాద్ అలీ నేడు సమాధానమిస్తూ భుట్టో నిందారోపణలు, మండలి సమావేశం లోని భారత్ వాకౌట్ చేసి ఉర్యాలనే చేసినవని భారత ప్రతినిధులు లేఖలో పేర్కొన్న విషయం వాస్తవం కాదన్నారు.

భారత్‌మండలి చర్చనుంచి వాకౌట్ జరిపి బాహాటంగా విద్రోహ వైఖరినే అవలంబించిన దని భారత్‌పై ఆరోపిస్తూ, ఈ వైఖరివల్ల ఉపఖండంలో సంభవించే పరిణామాలకు అది బాధ్యతవహించవలసివుంటుందని పేర్కొన్నారు.

భద్రతా మండలిలో చర్చ జరగనీయకుండా చేసి, సమావేశంనుంచి వాకౌట్ జరపడానికి, పాక్ విదేశాంగమంత్రి మండలిలో చెప్పిన విషయాలకు ఎట్టి సంబంధంలేదని ఆయన అన్నారు.

సింధు నదీజలాల ఒప్పందం, కచ్ ఒప్పందం పాకిస్తాన్ "సబబైన వైఖరికి" ఉదాహరణలని ఆయన అంటూ కాశ్మీర్‌పై భారత్ "మొండిపట్టును" విమర్శించారు.

భద్రతా మండలి అధ్యక్షునికి పాకిస్తాన్ మరొక లేఖ వ్రాస్తూ, దురాక్రమణకు గురి అయినది తానేనని అంటూ, భారత్—పాకిస్తాన్‌ల మధ్య సెప్టెంబర్ 6 వ తేదీన ప్రారంభమైన యుద్ధానికి బాధ్యులెవరో నిర్ణయించడంలో భద్రతా మండలి, సమితి సెక్రటరీజనరల్ సభ చేసే ఎటువంటి ప్రయత్నమైనా పాకిస్తాన్‌కు హర్షదాయకమని తెలియజేసింది.

## బద్వేలులో వందబస్తాల బియ్యం దోపిడీ

నెల్లూరు, నవంబర్ 3- ఇక్కడకు 75 మైళ్లలోగల కడపజిల్లా బద్వేలు పట్టణంలో పోలీస్ సబ్—ఇన్‌స్పెక్టర్, నెల్లూరు జిల్లా పౌర సరఫరా అధికారుల సమక్షంలో గ్రామస్థులు 100 బస్తాల బియ్యం దోపిడీ చేశారు. నెల్లూరు (దక్షిణం) జిల్లా గ్రెయిన్ పర్చేస్ ఆఫీసర్ శ్రీ బి. రాజన్, అసిస్టెంట్ గ్రెయిన్ పర్చేస్ తహసిల్దార్లు శ్రీ జె. మల్లికార్జునం, శ్రీ సుబ్బరామయ్యగారలు ఒక లారీని బాటా చెక్ పోస్టు (నెల్లూరు—కడప సరిహద్దు) నుంచి వెంటాడారు. ఆ లారీ బద్వేలులో నిలిచిపోయింది. డ్రైవరు, తదితరులు పారిపోయారు.

బియ్యం కొల్లగొట్టుకున్న వారిని స్థానిక పోలీసులు నిరోధించడానికి అశక్తతను వెల్లడించినట్లు తెలుస్తున్నది. 500 మంది గ్రామస్థులు వెదరించి లారీ తీసుకుపోయారు. అధికారులు నెల్లూరు కలెక్టర్‌కు పోలీసులకు ఫిర్యాదు చేశారు (స్వ.వి.)

## ** దినఫలం **

నూతన వ్యవహారాలకు: నవంబరు 4 గురువారం తిథిమంచిది. మధ్యాహ్నం 11—29 వరకు నక్షత్రం మంచిది. తరువాత మంచిది కాదు. 5 శుక్రవారం ఉదయం 9—17 గంటలవరకు తిథిమంచిది. తరువాత మంచిది కాదు. మధ్యాహ్నం 1—31 గంటలవరకు నక్షత్రం మంచిదికాదు. తరువాత మంచిది. ప్రయాణాలకు: నవంబరు 4 గురువారం తిథి మంచిది. మధ్యాహ్నం 11—29 గంటలవరకు నక్షత్రం సామాన్యం. (వజ్రయోగం మంచిది కాదు) తరువాత మంచిదికాదు (ముద్గరయోగం మంచిదికాదు) 5 శుక్రవారం ఉదయం 9—17 గంటలవరకు తిథి మంచిది. తరువాత మంచిదికాదు. మధ్యాహ్నం 1—31 గంటల వరకు నక్షత్రం మంచిదికాదు. (ధ్వాంక్ష యోగం మంచిదికాదు) తరువాత సామాన్యం (ధ్వజయోగం మంచిది) (వర్జ్యమును, దుర్ముహూర్తమును గమనించవలెను.)

4-11-1965 గురువారం

శ. సం 18. 7 కార్తికమాసం 13

**మేషం**

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు ప్రయోజనకరంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలించగలవు. అశ్వినీ నక్షత్ర జాతకులుమాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

**వృషభం**

వ్యాపారంలో మీ అభిప్రాయాలు సరియైనవని రుజువు కావడంవలన అధికాదాయం తోపాటు ఆత్మ విశ్వాసం కూడా లభిస్తుంది. వృత్తిలో మీకంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. కృత్తికా నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

**మిథునం**

అధికారులవలన జరగవలసిన వ్యవహారాలకు ఆఖరు క్షణంలో ఆటంకాలు యేర్పడడం వలన మిగిలిన కార్యక్రమాలు కూడ మార్చుకోవలసివస్తుంది. శుభ కార్యం విషయంలో స్వల్పాటంకాలు వస్తాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. పునర్వసూ నక్షత్ర జాతకులకు మాత్రం అంత బాగా ఉండదు.

**కర్కాటకం**

ఈ దినం కూడా అనుకూలంగా ఉంటుందని అనిపించడానికి అవకాశంలేదు. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాల్లో నష్టం రావచ్చును. ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. కుటుంబంలో స్వల్ప భేదాభిప్రాయాలు వస్తాయి. ఆశ్లేషా నక్షత్ర జాతకులకు మాత్రం కొంచెం బాగా ఉంటుంది.

**సింహం**

వృత్తి వ్యాపారాల్లో మీరు చేయవలసిన ముఖ్యమైన పనులు ఈ దినం పూర్తి చేయడం మంచిది. ఆర్థికంగా మీ స్వంత వ్యవహారాలు బాగానే ఉన్నా, ఉద్యోగంలో మాత్రం శ్రమ పొందవలసి వస్తుంది. విలాస వస్తువులు కొంటారు. పుబ్బా నక్షత్ర జాతకులు మాత్రం జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

**కన్య**

వృత్తి వ్యాపారాల్లో చాలా శ్రమ మీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు. వ్యాపారంలో కొన్ని అవకాశాలు అకస్మాత్తుగా కన్పిస్తాయి. కాని అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం. కుటుంబ కార్యక్రమాల్లో అధిక వ్యయం జరుగుతుంది. ఉత్తరా నక్షత్ర జాతకులు జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

**తుల**

భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు సామాన్యంగానే ఉంటాయి, కాని మీరు స్వంతంగా చేసే వ్యాపారాలు మాత్రం ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో మిత్రులకు ఉపకారం చేయడానికి అవకాశం లభిస్తుంది. పత్ని సౌఖ్యం లభిస్తుంది. విశాఖా నక్షత్ర జాతకులకు మాత్రం అంత అనుకూలంగా ఉండదు.

**వృశ్చికం**

కుటుంబ నిమిత్తం మీరు యే ప్రయత్నం చేసినా సులువుగా నెరవేరుతుంది. కాని మీ స్వంత వ్యవహారాల్లో మాత్రం చాలా ప్రతిఘటనను యెదుర్కొనవలసి వస్తుంది. స్థిరాస్థి వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. జ్యేష్ఠా నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే అనుకూలంగా ఉంటుంది.

**ధనుస్సు**

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలకు కొన్ని ఆటంకాలు ఏర్పడుతున్నట్లు కన్పిస్తాయిగాని మీరు ధైర్యంతో వ్యవహరించడంవలన వాటిని అధిగమించి తగినంత అభివృద్ధిని సాధించగలరు. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. మూలా నక్షత్ర జాతకులు జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

**మకరం**

ఆదాయంబాగానే ఉన్నా, కొన్ని వ్యవహారాల్లో కార్యసాధనకోసం మీ అభిప్రాయాలకు వ్యతిరేకంగా వ్యవహరించవలసి వస్తుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. బంధువుల వ్యవహారాల్లో మీ కృషి ఫలిస్తుంది. శ్రవణ నక్షత్ర జాతకులకు మిగిలిన వారికంటే అనుకూలంగా ఉంటుంది.

**కుంభం**

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోవలసిన అవసరం యేర్పడుతుంది. సాహిత్య కళా రంగాల్లో కృషి చేసే వారికి మంచి సమయం. పూర్వాభాద్రా నక్షత్ర జాతకులు జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం.

**మీనం**

వ్యాపారంలో మీరు యెంత మంచిగా ప్రవర్తించినా అది ఇతరులకు చెడుగానే కన్పిస్తుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం మంచిదికాదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. రేవతీ నక్షత్ర జాతకులకుమాత్రం కొంచెం బాగా ఉంటుంది.

— మహేష్

# లేఖలు

### క్రాఫ్టు ఉపాధ్యాయుల సాధక బాధలు

అయ్యా!

ప్రభుత్వంవారు ఇటీవల మెమోరాండం నెం. 4657 జి 2/ ... తేది 24—8—64 ను రద్దుచేస్తూ వెలువరించిన మెమోరాండం నెం. 4988 జి 2/ ...—1 తేది 24—8—65 మూలంగా హయ్యర్ టెక్నికల్ సర్టిఫికెట్ పరీక్షయందు ఉత్తీర్ణులైన వారికి కూడా 1 వ గ్రేడు స్కేలు తీసుకొనేందుకు యస్. యస్. యల్. సి. కావాలనే నిబంధన తిరిగి అనుసరించ వచ్చినది. ఇందువల్ల హయ్యర్ టెక్నికల్ టీచర్సు సర్టిఫికేటు పొందాలంటే యస్. యస్. యల్. సి. కావలసి ఉంటుంది.

అసలు 1958 కు పూర్వం ఒకేరకమైన వేతనాలు పొందుతున్న క్రాఫ్టు ఉపాధ్యాయులలో జి. ఒ. నెం. 2508 తేది 15—12—60 నందు వీవింగు, టైలరింగు ఉపాధ్యాయుల వేరుచేస్తూ రు. 50 — స్కేలు తీసుకునే వారికి కూడా తగ్గించి రు. 45 — స్కేలు నిర్ణయించడం జరిగింది. వీరు గ్రేడు 1 స్కేలు పొందేందుకు అసాధ్యమైన అర్హతలు సూచించడంజరిగింది. మిగిలినవారికి 1వ గ్రేడు స్కేలు యిస్తుంది. తరువాత వెలువడిన జి. ఒ.లు, మెమోలవల్ల కొన్ని నిబంధనలు సడలించి మెమోరాండం నెం. 4657 నందు — యస్. యస్. యల్. సి. తో నిమిత్తం లేకుండా హయ్యర్ టెక్నికల్ పొందిన వారికైనా 1 వ గ్రేడు వర్తించేట్లు చేయడం జరిగింది. నామమాత్రంగా కొందరికైనా 1 వ గ్రేడు లభిస్తుందని ఆశించాము. ఇప్పుడు వెలువడిన మెమో నెం. 4988 మూలంగా కొందరికైనా వర్తించే అవకాశం పోతుంది. ప్రభుత్వం ఈ విషయం సానుభూతితో పరిశీలించి వెంటనే నెం. 4988 మెమోను రద్దుచేయ విజ్ఞప్తి.

ఒకే అర్హత కలిగి సెకండరీ, హయ్యర్ ఎలిమెంటరీ పాఠశాలలందు పనిచేయు క్రాఫ్టు ఉపాధ్యాయులకు సమాన వేతనాలు, సంవత్సరాల తరబడి ఇంతవరకు అమలు జరగని జి. ఒ.లు, అప్పర్ ప్రైమరీ స్కూల్సునందు సెకండరీ పాఠశాలల ఉపాధ్యాయుల వేతనాలతో క్రాఫ్టు ఉపాధ్యాయుల నియామకం, గుంటూరు నందు వీవింగు హయ్యర్ టెక్నికల్ పరీక్షా కేంద్రం, రెండు మూడేండ్లనుండి వివిధ పాఠశాలలందు చదివిన టెక్నికల్ సర్టిఫికేట్లు గ్రేడుల నిర్ణయం మున్నగు విషయాలు పరిశీలించి అమలు జరపాలని, నామమాత్రంగా కొందరికైనా 1 వ గ్రేడు స్కేలు వర్తించేందుకు నెం. 4988 మెమోను రద్దు చేయాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేయుచున్నాము.

(సత్తెనపల్లి) బి. పి. ..., కన్వీనరు
జిల్లా క్రాఫ్టు టీచర్సు అసోసియేషను
(గుంటూరు జిల్లా)

### రైతులతో సహకరించని ప్రభుత్వ ధోరణి

అయ్యా!

ఈ మధ్య పత్రికలలో, మన ప్రధాని అధికాహారోత్పత్తి గురించి శ్రద్ధ వహించవలయునని రాష్ట్రాలకు విజ్ఞప్తి చేయడం, ఇప్పుడు మన ముఖ్య మంత్రి ప్రజలకు 'అధికాహారోత్పత్తికై పాటుపడండి' ఉద్బోధించడం అందరికి తెలిసిందే.

ఐతే ఈ అధికాహారోత్పత్తి 'నినాదం మాత్రమేనా, లేక అందులకు రైతులకు, ప్రభుత్వం, దాని శాఖలు యేమైనా ఇప్పుడైనా సహకరించగలవేమో చెప్పగలరా.

మా గ్రామానికి వ్యవసాయపనుల నిమిత్తం కరెంటు వచ్చి 10 సంవత్సరాలకావస్తున్నది. కొన్ని మోటార్లు కూడ ఇచ్చారు. సుక్షేత్రమైన భూమి నీరు ఉన్నది. దానికొన్ని గజాల దూరములో కరెంటులైను ఉన్నది. కాని విద్యుచ్ఛక్తి పొందుదామని మూడు సంవత్సరాలనుంచి యెన్ని కాగితాలు పెట్టినా బుట్టదాఖలా జరుగుచున్నది. సమాధానం అంటూ రావడంలేదు.

విద్యుచ్ఛక్తి ఉండి, నీరు ఉండి, అధికారుల నిర్లక్ష్యమువల్ల రైతుకునుపయోగములేకుండపోవుచున్నది.

ఇక ఎరువుల విషయం, ఎన్ని టన్నులు ఇన్ని టన్నులు అని పేపర్లో చూసి సంతోషించవలసినదే. రైతుకు సకాలములో ఎప్పుడిచ్చారు కనుక, దుక్కిలో వేసేది కలుపు తీతలలోనూ కలుపు తీతల్లో వేసేది కోతల్లో ఇచ్చినందువల్ల ప్రయోజనమేముంది. రైతుకు సకాలములో కావలసిన్ని యెరువులు సప్లయి చేసి, అప్పుడు రైతును పడుముకట్టు మంటే వుంటుంది.

ఇక నీటి పారుదల శాఖవారు యెంత దాకా ఇస్తారో, యెంతకి నీరు సప్లయి చేయగలరో వారికి తెలియదు. పలుకుబడిగలవారు దాళ్వాకి ఆర్డరు తెచ్చి వూడ్చినా పంట వచ్చేటప్పటికి నీటి యెద్దడి.

పరిస్థితులు ఈ విధంగా ఉండగా రైతును పండించమంటే యేమి పండిస్తాడు ? ఇప్పుడైనా అధికారులు అనవసర జాప్యాలు మానేసి రైతులకు సహకరిస్తారా ? లేనిచో 'అధికాహారోత్పత్తి' నినాదం మాత్రమే.

(కైకరం.) యెగ్గిన వరప్రసాద్

### విజయవాడ తెనాలి మధ్య రైళ్ళ రాకపోకల జాప్యం

అయ్యా !

ప్రతి దినము, తెనాలినుండి విజయవాడకు వెళ్ళవలసినను, విజయవాడనుండి తెనాలికి రావలసినను గంటల తరబడి రైళ్ళు ఆలస్యము గుచున్నది. కారణం ప్రతిరోజు బండ్లు ఆ ప్లాటుఫారంల మీద లగేజివాన్సును వుం... కాకినాడనుండి వచ్చుబండిని గుణదలలోను, గుంటూరునుండి వచ్చుబండిని సీతానగరం బ్రిడ్జి వద్దను గంటలతరబడి ఆపుటవలన ప్రజలకు చాలా యిబ్బందులు కలుగుచున్నవి. కాన రైల్వే వారు తగు శ్రద్ధ తీసుకొనవలసిందిగా కోరుచున్నాను.

(రేపల్లె) బలగం సోమశేఖరరావు

### గ్రంథాలయాలకు గ్రాంట్లు

అయ్యా !

పంచాయతీలు, సహకార సంఘాలు, ... స్వారు కాబడిన ప్రయివేటు సంస్థలు మరియు గ్రామ సంఘములు నిర్వహించుచున్న గ్రంథాలయములకు లోకల్ లైబ్రరీ అథారిటీల ద్వారా ప్రభుత్వమునుండి గ్రాంట్లు ప్రతి సంవత్సరం మంజూరు చేయబడుచున్నవి.

ఈ సంవత్సరము పశ్చిమ గోదావరిజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ గ్రంథాలయోద్యోగులు క్రిందటి సంవత్సరమున గ్రాంటు పొందిన గ్రంథాలయములకు మాత్రమే ఆఫీ చేసి వాటినుండి గ్రాంటు దరఖాస్తు ఫారములు తీసుకుని పంపుచున్నారు కావున లోగడ గ్రాంటు పొందని గ్రంథాలయముల నిర్వాహకులు తమకు దగ్గరగాయున్న గ్రంథాలయోద్యోగుల ద్వారా గ్రాంటు దరఖాస్తులను వెంటనే పంపుకొన కోరుచున్నాను. గ్రంథాలయముల నిర్వహించువారు ఈ సదవకాశం వినియోగించుకొన కోరుచున్నాను.

సి. గోవిందరావు కార్యదర్శి పశ్చిమ గోదావరి జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ ఏలూరు.



రక్షణశాఖామంత్రి శ్రీ వై. బి. చవాన్ మధ్యప్రాంత సైనిక ప్రధాన సైనికాధికారి లెఫ్టినెంట్ జనరల్ జె. బహదూర్‌సింగ్‌తోపాటు ఉత్తర ప్రదేశ్‌లోని అగ్రశ్రేణి ప్రాంతాలను పరిశీలించినప్పుడు సైనికులను ప్రబోధించారు.

# శోచనీయమైన విదేశాంగ విధానం

## స్వతంత్రపార్టీ విమర్శ; వాస్తవతాయుతమైన దౌత్యనీతిని రూపొందించాలని విజ్ఞప్తి

న్యూఢిల్లీ, నవంబరు 3: కాంగ్రెసు ప్రభుత్వం అనుసరిస్తున్న శోచనీయమైన విదేశాంగ విధానాలవల్ల భారతదేశం ఏకాకి అయిపోయిందనీ, చైనా ప్రమాదం దృష్ట్యా, ఈ ఏకాకి తనాన్ని అంతమొందించటానికి విదేశాంగ విధానాన్ని సమూలంగా పునర్నిర్మాణం చేసి, వాస్తవికతాయుతమైన దౌత్యనీతిని అనుసరించాలనీ, స్వతంత్రపార్టీ జాతీయ కార్యనిర్వాహకవర్గం నిన్న ఒక తీర్మానంలో కోరింది.

ఇటీవల జరిగిన పోరులో మలేసియా, సింగపూర్‌లతప్ప మరెవ్వరూ భారత్‌ను సమర్థించలేదని కార్యనిర్వాహకవర్గం తీర్మానంలో పేర్కొన్నది.

కామన్‌వెల్తునుంచి వైదొలగాలన్న ప్రతిపాదనను కార్యనిర్వాహకవర్గం 'పూర్తిగా' వ్యతిరేకించింది.

కాశ్మీర్‌పై దురాక్రమణను నిరోధించేందుకు, అతిక్రమణల నివారణకు అన్ని చర్యలూ తీసుకోవాలనీ, ఉభయ దేశాలమధ్య సన్నిహిత స్నేహ సంబంధాలు ఏర్పడేరోజు వస్తే అందుకు పాకిస్తాన్ ఇష్టపడినా, కోరికనూ వెలిబుచ్చితే అందుకుకూడా సిద్ధంగా వుండాలనీ తీర్మానం పేర్కొన్నది.

తీర్మానంలో ఇంకా ఇలా వుంది: "అక్రమ ప్రవేశాలు జరుగుతున్నప్పుడు కాశ్మీర్ ప్రజల సుహృద్భావము నిర్ణయాత్మకమైన ప్రాముఖ్యము కలిగి వుంటుంది. సాయుధ దురాక్రమణ జరిపినందువల్ల పాకిస్తాన్ ప్రభుత్వం కాశ్మీర్ సమస్యపై చర్చించే హక్కు కోల్పోయినా, కాశ్మీర్ ప్రజలపట్ల భారత్‌కున్న బాధ్యతలు తగ్గవు.

"అందువల్ల కాశ్మీర్ ప్రజలకు, భారత్‌కు సంతృప్తిగా ప్రయోజనకరమూ, ఆమోదయోగ్యమూ అయిన పరిష్కారాన్ని సకాలంలో సాధించాలి."

కాశ్మీరీ నాయకుల అరెస్టుకు కార్యనిర్వాహకవర్గం విచారం వెలిబుచ్చింది. కాశ్మీర్ విషయంలో వారి అభిప్రాయాలు ఎటువంటివైనా, పాక్‌తో కలియటానికి వారు వ్యతిరేకులని కార్యనిర్వాహకవర్గం పేర్కొన్నది.

రెండు రోజులుగా జరిగిన కార్యనిర్వాహకవర్గ సమావేశం నిన్న ముగిసింది. సమావేశానికి శ్రీయుతులు సి. రాజగోపాలాచారి, కె. ఎం. మున్షీ, మసానీ, మహారాణిగాయత్రీదేవి ప్రభృతులు హాజరైనారు. శ్రీ రంగా అధ్యక్షత వహించారు.

## డిగ్రీ పరీక్షలకు ప్రైవేట్ అభ్యర్థులకు అనుమతి

### వెంకటేశ్వర విశ్వవిద్యాలయం తీర్మానం

తిరుపతి, నవంబరు 3: శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రాంతంలో వరుసగా రెండేళ్లు నివాసమున్న అభ్యర్థులను ప్రైవేట్‌గా పి.యు.సి., డిగ్రీ పరీక్షలకు హాజరుకావడానికి అనుమతిస్తూ విశ్వవిద్యాలయం విద్యా విషయక సంఘం మొన్న ఒక తీర్మానం చేసింది.

సైనిక దళాలలో స్వచ్ఛందంగా సేవ చేయడానికి ముందుకు వచ్చిన వైద్య విద్యార్థులకు పెక్కు సదుపాయాలు కలుగజేసేందుకు ఈ సంఘం అంగీకరించింది.

సమావేశానికి హాజరైన గౌరవ సభ్యుడు డాక్టర్ బి. గోపాలరెడ్డి ప్రైవేట్ అభ్యర్థులను అనుమతించే విషయంలో ఆంక్షలు విధించడాన్ని వ్యతిరేకించారు. దేశంలో అన్ని ప్రాంతాల విద్యార్థులు ప్రైవేట్‌గా ఈ విశ్వవిద్యాలయం పరీక్షలకు హాజరు కావడానికి అనుమతించి ఆదర్శప్రాయం కావాలని ఆయన సూచించారు.

# రాష్ట్ర వార్తలు

## లఘు పరిశ్రమలకు ఋణ సదుపాయాలు

### తెనాలి సమావేశంలో చర్చ

తెనాలి, నవంబర్ 2—గుంటూరు జిల్లా లఘు పరిశ్రమల సంఘం కార్యవర్గ సమావేశం గత నెల 27 వ తేదీన ఇక్కడ శ్రీ పి. ఎస్. వెంకటేశ్వరరావు అధ్యక్షతన జరిగింది. గ్రామీణ పారిశ్రామికీకరణ శాఖ డిప్యూటీ డైరెక్టర్ శ్రీ సి. ఆర్. దేశికన్, వాణిజ్య పరిశ్రమల శాఖ అసిస్టెంట్ డైరెక్టర్ శ్రీ ప్రసాదరావుగారలు హాజరయ్యారు. తెనాలి స్టేట్ బ్యాంకు ఏజంటు శ్రీ ఎ. శ్రీరామారావు ప్రత్యేకాహ్వానంపై హాజరయ్యారు.

డిసెంబర్ మొదటివారంలో గుంటూరులో జరిగే సదస్సుకు సంపూర్ణ సహకారంఅందజేయాలని ఏకగ్రీవంగా నిర్ణయించారు. లఘు పారిశ్రామికులకు ఋణ సదుపాయం చేసేందుకు గల వివిధ అవకాశాలను గురించి వివరంగా చర్చించారు.

సర్వశ్రీ ఎం. ఎల్. కాంతారావు, పి. సుబ్బారావు, అక్కల వెంకట్రామయ్య, బి. లక్ష్మయ్యగారలను కార్యవర్గంలో చేర్చుకున్నారు. రక్షణ నిధికి 116 రూపాయలు విరాళం ఇచ్చేందుకు నిర్ణయించారు. ప్రధాన కార్యదర్శి డాక్టర్ ఆర్. శ్రీనివాసాచార్య వందన సమర్పణ చేశారు. (స్వ.వి.)

## విజయనగరం విజ్ఞాన వేదిక కార్యవర్గం ఎన్నిక

విజయనగరం, నవంబర్ 2—ఇటీవల ఇక్కడ స్థాపించబడిన "విజ్ఞానవేదిక" కార్యనిర్వాహకులుకోటవెంకటశివనహాలులో సమావేశమై సంఘం తాలూకు ముసాయిదా ఆశయాలను, నియమావళిని చర్చించారు. సమావేశానికి శ్రీ వసంతరావు వేంకటరావు అధ్యక్షత వహించారు. సమావేశ కర్త శ్రీ భాట్టం శ్రీ రామమూర్తి, (ఎమ్. ఎల్. ఎ.,)నియమావళి ముసాయిదాను చదువగా సభ్యులు స్వల్పమైన సవరణతో దానిని ఆమోదించారు. ఈ సంఘ ప్రథమ కార్యవర్గంగా ఈ క్రింది వారిని ఎన్నుకొనడమైనది.

గౌరవాధ్యక్షులు: శ్రీ వసంతరావు వేంకటరావు, అధ్యక్షులు: శ్రీ భాట్టం శ్రీరామమూర్తి, (ఎమ్. ఎల్. ఎ.), ఉపాధ్యక్షులు: శ్రీ ఎమ్. వి. రామదాసు, శ్రీ వై. నారాయణమూర్తి, ప్రధాన కార్యదర్శి: శ్రీ పి. ఎల్. పి. రాజు, కార్యదర్శి: శ్రీ ఆనవెళ్ల ప్రకాశరావు, కోశాధికారి: శ్రీ పి. వి. కృష్ణమూర్తి రాజు, మరి కొంత మందిని కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకోవడమైనది. (స్వ.వి.)

## నిడుబోలులో రైఫిల్ శిక్షణ కేంద్రం

నిడుబ్రోలు, అక్టోబరు 28: పౌరులందరూ అత్యవసర పరిస్థితిలో పౌరరక్షణలో తర్ఫీదు పొందటం ప్రధానమైన విధి అని ఆర్. డి. ఓ. శ్రీ జి. వెంకటరెడ్డి, ఇటీవల ఇచ్చట పి. బి. ఎస్. కళాశాల ఆవరణలో పౌరుల రైఫిల్ శిక్షణ కేంద్రానికి ప్రారంభం చేస్తూ చెప్పారు. పౌరరక్షణకు స్త్రీలు పురుషులను ఉత్సాహ పూరితులను చేసి, దేశ స్వేచ్ఛకు పాటుపడాలని సూచించారు.

పౌర రక్షణ, దేశస్వాతంత్ర్య రక్షణకు చాల అవసరమనీ, సరిహద్దుల రక్షణ తరువాత పౌరరక్షణ ప్రాధాన్యం వహిస్తుందనీ శ్రీ జి. వెంకటరెడ్డి అన్నారు. పోలీస్ డిప్యూటీ సూపరింటెండెంటు శ్రీ హను మంతరెడ్డి ఐకమత్యం, సహకారం పెంపొందించుకొంటూ పౌర రక్షణ కృషిలో పోటాపోటీలు పడటం చాల ముఖ్యమని అన్నారు.

జిల్లా కాంగ్రెస్ సభ్యుడు శ్రీ ఏ. శేషగిరిరావు, డా. చంద్రశేఖర పి. బి. ఎస్. కళాశాల ప్రధానోపన్యాసకులు శ్రీ శ్రీమన్నారాయణ కూడ దేశరక్షణ, శాంతి గురించి మాట్లాడారు. కళాశాల కమిటీ కార్యదర్శి శ్రీ పి. బుచ్చినాయుడు సభకు అధ్యక్షత వహించారు.

## సభలు - సమావేశాలు

శ్రీశైలంలోని అఖిలభారత ఆర్యవైశ్య సత్రభవనంలో ఈ నెల 4 వ తేదీనుంచి 10 వ తేదీ వరకు "శ్రీ సి... [illegible]" నామ సప్తాహము, 11 వ తేదీన పూర్ణాహుతి జరుగును.

## నెల్లూరు జిల్లాలో అనావృష్టి పరిస్థితి

### పరిషత్తు అధ్యక్షుడు చంద్రశేఖరరెడ్డి ప్రకటన

నెల్లూరు, అక్టోబర్ 31: నెల్లూరు జిల్లా క్షామ పరిస్థితులను గురించి జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ ఎన్. చంద్రశేఖర రెడ్డి నిన్న ముఖ్యమంత్రికి ఈ క్రిందివిధంగా తెలియజేశారు.: "జిల్లాలో అధిక ప్రాంతంలో క్షామ పరిస్థితి ఉంది. 13 తాలూకాలకు 11 తాలూకాలలో 30 మాగాణి, మెట్ట పైర్లు అనావృష్టి ఫలితంగా నాశనమయ్యాయి.

"ఈశాన్య ఋతు పవనాలలో వర్షం పడలేదు. రాపూరు, వెంకటగిరి తాలూకాలలో క్షామపరిస్థితి తీవ్రంగా ఉంది. దర్శి, పొదిలి, కనిగిరి, ఉదయగిరి, ఆత్మకూరు తాలూకాలలో జొన్న, వేరుశనగ పైర్లు బాగా దెబ్బతిన్నాయి. మెట్ట తాలూకాలలో ఆముదాలు మినప పైర్లు తెగుళ్లవల్ల పూర్తిగా దెబ్బతిన్నాయి. సూళ్లూరుపేట, గూడూరు తాలూకాలలో మూడవ భాగం ఇంతవరకు నార్లు వేయలేదు. వరి పంట ఎండిపోతున్నది.

"మెట్ట తాలూకాలలో పెద్ద, చిన్న చెరువులు ఎండి పోయాయి. పెన్నా డెల్టా కింద నెల్లూరు, కోవూరు తాలూకాలలో కూడా పంటల పరిస్థితి అసంతృప్తికరంగా ఉంది. అక్కడ మొలగొలుకులు (వరిపైరు) తెగుళ్ల పట్టి దెబ్బతిన్నాయి. లక్ష ఎకరాలు సాగుకు నీరు సరఫరా చేసే కనిగిరి రిజర్వాయరులో 15 రోజులకు సరిపడిన నీరు మాత్రమే ఉంది. నెల్లూరు, సర్వేపల్లి రిజర్వాయర్ల కింద పరిస్థితి మరింత అధ్వాన్నంగా ఉంది."

## ఒంగోలులో పౌరులకు రైఫిల్ శిక్షణ

ఒంగోలు, అక్టోబరు 2: దాడిమూకలను వెడలగొట్టి శాంతి కాపాడుటకోసం, రైఫిల్ శిక్షణ కార్యక్రమంలో యువకులు పాల్గొని బాగా తర్ఫీదు పొందుటకై పెద్ద సంఖ్యలో వారిని రైఫిల్ శిక్షణ కేంద్రంలో చేర్చుకోవాలని, స్థానిక రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్ శ్రీ జి. వెంకటరెడ్డి, అక్టోబర్ 7 ఉదయం ఇచ్చట చెప్పారు. పౌర రైఫిల్ శిక్షణ కార్యక్రమాన్ని ప్రారంభించిన సందర్భంలో శ్రీ రెడ్డి మన దగ్గరలో ప్రమాదం యేదీ లేదని మాట్లాడకుండా కూర్చోరాదని పౌరరక్షణ కృషిలో ప్రతి ఒక్కరూ ప్రభుత్వంతో సహకరించాలని దేశ రక్షణకు పౌర రక్షణ కూడ చాలా ప్రధానమని, ఉద్బోధించారు.

ప్రారంభోత్సవ సభకు జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ రొండా నారపరెడ్డి అధ్యక్షత వహించారు. డిప్యూటీ పోలీస్ సూపరింటెండెంట్ శ్రీ కె. రంగారావు కృతజ్ఞతలు తెలిపారు. కార్యక్రమానికి ముందు తేనీటి విందు యేర్పాటయింది.

## ఆధికోత్పత్తి సాధనకు ప్రభుత్వ సహకారం

### గరగపర్రు సభలో మంత్రి రాఘవులు హామీ

గరగపర్రు, నవంబర్ 2: అధికాహారోత్పత్తి సాధనకు రైతులకు అన్నివిధాలా తోడ్పడమే ప్రభుత్వ లక్ష్యమని రాష్ట్ర పబ్లిక్‌వర్క్స్ శాఖమంత్రి శ్రీ తానేటి వీరరాఘవులు గత నెల 24 వ తేదీన భీమవరం తాలూకా గరగపర్రు హైస్కూలులో జరిగిన బహిరంగ సభలో మాట్లాడుతూ పేర్కొన్నారు. ఈ సందర్భంలో జరిగిన సభకు శ్రీ గోకరాజు శ్రీరామరాజు అధ్యక్షత వహించారు. మంత్రి గ్రామానికి రాగానే భీమవరం భూమి తనఖా బ్యాంకు అధ్యక్షుడు శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజు, పంచాయతీ అధ్యక్షుడు శ్రీ మంతెన అప్పలరాజు ప్రభృతులు స్వాగతం చెప్పి ఊరేగింపుతో పాఠశాలకు తీసుకు వెళ్లారు.

సర్వశ్రీ నాదు వెంకట్రామయ్య (ఎం. ఎల్. ఎ.), గొల్లుముక్కల రామచంద్రరాజు, పి. వి. ఎల్. తిమ్మరాజు, దంతులూరి రామరాజు ప్రభృతులు వేదిక నలంకరించారు. మంత్రివెంట పలువురు అధికారులు, కాంగ్రెస్ ప్రముఖులు వచ్చారు. పంచాయతీ అధ్యక్షుడు శ్రీ మంతెన అప్పలరాజు మంత్రికి స్వాగత పత్రం సమర్పించారు.

కిన్నెరపురం ఛానల్ సెవారు భూములు రైతులు ఎదుర్కొంటున్న సమస్యలపై శ్రీ పెరుమాళ్ల వెంకటేశ్వర్లు మంత్రికి విజ్ఞాపనపత్రం సమర్పించారు.

మంత్రి శ్రీ రాఘవులు మాట్లాడుతూ, ప్రస్తుతం దేశం ఎదుర్కొంటున్న క్లిష్ట పరిస్థితిని వివరించి, రక్షణనిధికి ఉదారంగా విరాళాలు ఇవ్వవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేశారు. ఈ తాలూకాకు చెందిన మహాదేవపట్నం వాస్తవ్యుడు సుబేదారు రాజు అమృత్‌సర్ పట్టణాన్ని కాపాడడంలో ప్రదర్శించిన అప్రతిహతమైన పరాక్రమాన్ని, దేశభక్తిని శ్రీ రాఘవులు శ్లాఘించారు. గుంటూరు జిల్లాకు చెందిన హవల్దార్ పోతరాజు సేవలను కూడా మంత్రి ప్రస్తావించారు.

దేశరక్షణనిధికి ఇద్దరు బాలికలు సమర్పించిన నెహ్రూ, రాధాకృష్ణన్‌ల చిత్రపటాలను వేలంవేయగా శ్రీ నెహ్రూ చిత్రపటాన్ని శ్రీ మంతెన రామరాజు 116 రూపాయలకు, రాధాకృష్ణన్ చిత్రపటాన్ని శ్రీ దెందుకూరి అప్పలరాజు 116 రూపాయలకు పాడారు. శ్రీ మంతెన వెంకట్రామరాజు 116 రూపాయలు సమర్పించారు. ఈ సందర్భంలో రక్షణనిధికి మొత్తం 580 రూపాయలవరకు వసూలయింది. శ్రీ మంతెన అప్పలరాజు వందన సమర్పణ చేశారు.

## 'విజయవాడలో కూరల దినోత్సవం'

### 6 వ తేదీ ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం

విజయవాడ, నవంబర్ 3—విజయవాడలో 6 వ తారీఖున 'కూరగాయల దినోత్సవం జరుగుతుంది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఈ ఉత్సవాన్ని ప్రారంభిస్తారు. నీటి పారుదల, వ్యవసాయశాఖ మంత్రి, రాష్ట్ర వ్యవసాయ శాఖ డైరెక్టరు ఈ ఉత్సవంలోపాల్గొంటారు. ప్రతి గృహస్థు తమ ఇళ్లలోని దొడ్లలో కూరగాయలు పెంచటం, ప్రజలతో కూరగాయల పండించటం పట్ల ఆసక్తి కలుగచేయుటం ఈ ఉత్సవం యొక్క ఉద్దేశం.

ఇటీవల ముఖ్యమంత్రి, ఆఫీసు కాంపౌండులలోను, నివాస గృహాల కాంపౌండులలోను కూరగాయలు పెంచమని ఒక విజ్ఞప్తిచేశారు. బంగళాలలోని పూలతోటలను పచ్చిక బయళ్లను కూరల మళ్లగా మార్చాలని కూడ పేర్కొనబడింది. ఈ సందర్భంలో ఒక కాయకూరల ప్రదర్శనం ఏర్పాటు చేయాలని జిల్లా వ్యవసాయ శాఖాధికారి శ్రీ టి. వెంకటరామిరెడ్డి కృషి చేస్తున్నారు. ఇప్పటికిప్పుడే విత్తనాలు, మొక్కలు సప్లయి చేయుటం ద్వారా ఆయన పట్టణంలో వంద ఇళ్లలో కూరగాయపాదులు ఏర్పాటు చేశారు. సూర్యారావుపేటలోని వ్యవసాయశాఖ కార్యాలయంలో కావలసినవారికి కూర విత్తనాలు లభించగలవని ఆయన తెలియచేస్తున్నారు.



యూనియన్ ఉక్కు, గనుల శాఖామంత్రి, శ్రీ అహోబిలం లక్ష్మీనరసింహస్వామి దేవాలయ పునరుద్ధరణ సంఘాధ్యక్షుడు శ్రీ సింహం ... రెడ్డి ఆంధ్రప్రదేశ్ [illegible] దేవాలయ పునరుద్ధరణ [illegible] అక్టోబరు 28 [illegible] డాక్టర్ చెన్నారెడ్డి (ముఖ్యమంత్రి [illegible])

# మార్కెట్‌ధరలు

## హైదరాబాదు

హైదరాబాద్, నవంబర్ 3: కె. జయప్రకాశ్‌రాం అండ్ కంపెనీ ఉస్మాన్‌గంజి హైదరాబాద్.

| | |
|---|---|
| 1. తెల్ల జొన్నలు | 70—80 |
| 2. పచ్చి జొన్నలు | |
| 3. పచ్చ జొన్నలు | 52—57 |
| 4. పసుపు | 105—125 |
| 5. కందులు | 84—94 |
| 6. ఎర్రకందులు (చిన్నవి) | 75—84 |
| 7. పెసలు | 87—92 |
| 8. మినుములు | 79—80 |
| 9. లంకలు | |
| 10. శనగలు | 159—160 |
| 11. ఉలవలు | 65—66 |
| 12. బెల్లము | 36—51 |
| 13. మిర్చి | 250—334 |
| 14. చింతపండు | 160—230 |
| 15. ఉల్లిగడ్డ | 25—30 |
| 16. గోధుమలు | 110—122 |
| 17. ఎర్ర గోధుమలు | |
| 18. మక్క గోధుమలు | 120.00 |
| 19. కుసుమలు | 90—93 |
| 20. నువ్వులు | 175—190 |
| 21. ఇలాతి పలుకు చిన్నది. | 118—139 |
| 22. ఇలాతిపలుకు పెద్దది | 145—165 |
| 23. ఆముదాలు | 98—100 |
| 24. ప్రత్తి గింజలు | 70—75 |
| 25. మంచినూనె | |
| 26. పెద్ద కందిపప్పు | 125—128 |
| 27. చిన్న కంది పప్పు | 110—114 |
| 28. మినప్పప్పు | 98—103 |
| 29. పెసరపప్పు | 114—119 |
| 30. శనగపప్పు | |
| 31. సిరిశనగపప్పు | 105—121 |
| 32. లంకపప్పు | |
| 33. ధనియాలు | 250—270 |
| 34. ఇలాతికాయ | 95—105 |

## వెండి మార్కెట్

హైదరాబాద్, నవంబర్ 3: పముద్రాల రాఘవులుగారి చంద్రయ్య, వెండి బంగారం, నరుకులు, సిద్ధియాంబర్ బజార్, హైదరాబాద్, ఫోన్ నెంబరు 43080.

1. వెండి 1 కిలోగ్రాము రు. 300—00
2. వెండి 10 గ్రాములు రు. 3—10

## మద్రాస్ మార్కెట్

### వెండి ధరలు

మద్రాసు, నవంబర్ 3:

వెండి కిలోగ్రాం రు. 311—00
వెండి చిల్లరధర 10 గ్రాములు రు. 3—15

### వేరుశనగనూనె

మద్రాసు గిడ్డంగివద్ద చిల్లరగా 100కిలోగ్రాములు రెడీ రు. 320—00

### వేరుశనగకాయలు

బోల్డు 80 కిలోగ్రాములు
సుపీరియర్
కోస్టై పటాణి రు. 96—00 120—00

### ఆముదం

100 కిలోగ్రాములు
తిరువత్తూరు రు. 232—00

### కొబ్బరినూనె

క్వీన్ ఎం. ఎస్ రు. 87—50
లోటస్ రు. 86—00
రాజా రు. 86—50

### వేరుశెనగపిండి

72 కిలోల బస్తా రు. 36 5[illegible]

